


జయజయ గృహలక్ష్మి స్త్రీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతీమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

---

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఎడిటర్ :
సి. సి. పున్నయ్య

---

# బ్రిటిషు రాణికి సుస్వాగతము

అగ్రరాజ్యాలలో నొకటగు బ్రిటనుకు రాణి రెండవ ఎలిజబెత్ మన దేశమునకు సందర్శనార్థము వచ్చిన సందర్భమున హృదయ పూర్వకంగా స్వాగతము చెప్పుచున్నాము.

రాజుగాని, రాణిగాని దేవాంశములతో కూడిన వారని అనాదినుండి ఒక విశ్వాసం. అట్టి భగవదంశములు లేనివారెవ్వరు రాజ్యాధినేతలు కాలేరు. కాబట్టే ప్రజలు భగవంతుని తర్వాత ఆయన ప్రతినిధిగా రాజునుగాని, రాణినిగాని భక్తివిశ్వాసాలతోటి ఆరాధించి ప్రేమిస్తారు.

అయితే యీ రోజుల్లో పలుకారణాలవలన రాజరికంపట్ల ద్వేషంపెరిగి ప్రజాస్వామ్య నియంతృత్వాలు దానిస్థానంలో నెలకొన్నా యిప్పటికింకా కొందరురాజులు, రాణులు ఉండి రాజ్యపరిపాలన చేస్తున్నారంటే దానికి కారణం వారిలోని దేవాంశాలే.

మనమీనాడు స్వాగతం చెపుతున్న ఎలిజబెత్ రాణి తాతల తండ్రులసార్వభౌమత్వముక్రింద పాలింపబడి ఆరవజార్జి చక్రవర్తి కాలంలోనే మనదేశం స్వతంత్రమయింది. మనసాంఘిక, రాజకీయ, వైజ్ఞానిక, సాంస్కృతికరంగాలలో ఆంగ్ల ప్రభావము అత్యధికము. ఒకప్పుడు ఆంగ్లేయులు, మనము పరస్పరం విరోధులమైనా యీనాడు బ్రిటను, ఇండియాలమధ్య అనేకవిధాల సన్నిహిత సత్సంబంధాలు ఏర్పడి మిత్రరాజ్యాలుగానున్నవి. మన జాతీయఅభివృద్ధి అభ్యుదయాలపట్ల ఆంగ్లప్రభుత్వము, ప్రజలు అత్యంతాసక్తిగలిగి సహకరిస్తున్నారు. అంతర్జాతీయ రంగంలో మనకనేకవిధాల సానుభూతితో సహకరిస్తున్న దేశం బ్రిటను. బ్రిటిషురాణిరాక, మనదేశంలో పర్యటన మరింత పరస్పర సత్సంబంధాలు నెలకొనడమే కాక మనదేశాన్ని, ప్రజలను గురించి, మనపురోగమనాన్ని గురించి తెలిసికోకలుగడం సంతోషకరం.

మనదేశం సత్సాంప్రదాయాలలాంటి అతిథిసత్కార, సన్మానాలకు అనాదినుండి పేరుపడ్డది. బ్రిటిషురాణిని రాజోచితలాంఛనాలతో సత్కరించి సన్మానించింది మనదేశం. ప్రజలు ఆనందంతో రాణికి స్వాగతమిచ్చారు. కానికొన్ని రాష్ట్రాలలో రాణిరాకసందర్భమున అనవసర ఖర్చులు, దుబారాగా జరిగినవని విమర్శించడం, చర్చించపూనుకోడం శోచనీయము. సన్మానసత్కారాలు హోదాలనుబట్టి జరిగేవి. అగ్రరాజ్యమైన బ్రిటనుకు రాణి మనదేశం పర్యటనకు వస్తేఆమె సత్కారసన్మానాలకు అవుతున్న ఖర్చులనుగురించి దుబారా అనిగాని, అనవసరఖర్చులనిగాని ఆమె మనగడ్డమీద నుండగానే కొందరు ప్రముఖులు ప్రస్తావించడం మనజాతీయ సాంప్రదాయానికే విరుద్ధం.

బ్రిటిషురాణి, ఆమెభర్త. కుటుంబం కలకాలం ఆయురారోగ్యాలతో వర్ధిల్లుతూ, మనదేశానికి, బ్రిటనుకు మధ్య సద్భావ సహకార సహాయములు పెంపొందుగాక !

—(o)—

# నిర్మాణము — నిర్వహణ



ఉద్యమాలు, సంస్థలు, జీవితాలు అభివృద్ధి అభ్యుదయాలనుద్దేశించి పురోగమించుటకు నిర్మాణము ఎంతప్రధానమైనదో నిర్వహణ సయితము అట్టిదే. నిర్మాణ సందర్భపు ఆసక్తి, చిత్తశుద్ధి, ఆదర్శలత్యాగాలు నిర్వహణ సందర్భముననున్న నేకాని అవిరాణించి ఉపయుక్తముకానేరవు.

ఈ వాదం సాంఘిక, రాజకీయరంగాలలో సూచ తప్పకుండా అమలుజరుగాలి. సంఘ సంక్షేమాన్ని ఉద్దేశించి రూపొందించే సంస్కరణలు, కార్యకలాపములు, ప్రణాళికలు ఎంత ఉత్తమమయినవైనా వానిని అమలుపరచి నిర్వహించే సందర్భమున ఆసక్తి, చిత్తశుద్ధిలోపిస్తే వానివల్లసత్ఫలితములుండవు, ఒకభవనమునో, లేక

ఒక ఉద్యానవనమునో మనోజ్ఞంగా నిర్మించినా వానిని ఉపయుక్తంగా, శ్రద్ధాసక్తులతో నిర్వహించబడక పోయినచో అవితనకు కాదుకదా మరెవ్వరికి వినియోగపడకపో వచ్చును. అలాగే రాజకీయపార్టీలు ఉత్తమ ఆదర్శలక్ష్యాల సాధనకు నిర్మాణమయినా వాని నిర్వహణ పటిష్టంగాను, క్రమశిక్షణాయుతంగాను, నీతినిజాయితీలతో జరుగనిచో అవి ప్రజలకు నాయకత్వము వహించలేకపోయి, దేశాన్ని తప్పుడుదార్లలోకి లాగగలవు.

మానవుడైనా బాల్యమునుండి ఒడ్డుపొడుగు కలిగి విద్యావిజ్ఞానము లార్జించి పౌరుడుగా రూపొందుతాడు. కాని జీవయాత్రలో ఉత్తమధర్మాలను విడనాడినచో ఆ మానవుడు రాణించలేడు; పౌరుడుగా సంఘానికి, దేశానికి ఉపకరించడు. ఇట్టి మానవుడు ప్రమాదకరమైనట్టి వాడుగాకూడ కాగలడు.

కాబట్టే ఉద్యమాలు, సంస్థలునిర్మాణం జరుగడం ఎంత అవసరమని ప్రజలు భావిస్తారో వాని నిర్వహణపట్ల సయితం అత్యంత ఆసక్తికలిగి, ఉత్తమ ఆదర్శ లక్ష్యాలైన ఉమ్మడి శ్రేయో సౌభాగ్యములను రూపొందించవూనుకోవాలి! ఏ ఉద్యమంకాని ఏ సంస్థకాని ఉమ్మడి శ్రేయస్సునుద్దేశించి చిత్తశుద్ధితో కృషిచేయపూనుకోడమంటే త్యాగములు చేయుటకు సయితము ముందంజవేయాలి. త్యాగసేవాసక్తి లేనిదే ఉమ్మడిశ్రేయస్సు రూపొందడంకల్ల. పదిమందిగల ఒక సంఘంలోని ఒకరు, యిద్దరు తమకొన్ని అదనపుహక్కులు, అవకాశములు విడనాడవలసివచ్చినా, దాని వలన మిగిలిన ఎనిమిదిమంది, తాము సమానహక్కులు, అవకాశములతో నిస్పృహ, నిరాశలులేకుండా సంఘంలో జీవయాత్రగడుపడం మేలనిపించుకుంటుంది. అదే ఇద్దరు అదనపుహక్కులతో అవకాశములతో మిగతావారిలో అసూయ, నిరాశ, నిస్పృహలకు కారకులైనచో ఉమ్మడి శ్రేయస్సుకు అవకాశములేదు సరికదా సంఘంలో పరస్పరసద్భావసహకారములకు, భద్రతకు లోటుకనుపించుచుండును.

ఈ నాడు భారతప్రజల నెదుర్కొంటున్న సమస్యలురెండు — ఒకటి శాంతి యుతపద్ధతులలో ఉమ్మడిశ్రేయస్సును రూపొందించే మార్గాలు. రెండవది ఇంతవరకు భూకామందులుగానో, సంపన్నులుగానో సామాన్యప్రజలపై తమ అధికార ఆధిపత్యాలను చలాయించ అలవాటుపడి, ఉమ్మడిశ్రేయస్సువలన తమ అదనపు అవకాశములకు హక్కులకు ముప్పమురానుండుటను గుర్తించి కల్లబొల్లి నినాదాలతో ప్రజలను రెచ్చగొట్టి తమ స్థిమితానికి, స్థితిగతులకు చలనములేకుండా చేసికొనే ప్రయత్నాలు. ఈ నాడు కాంగ్రెస్ పార్టీ నిర్వహణలో లోపాలుండవచ్చు. కాంగ్రెసువాదులలో అనేకమంది చిత్తశుద్ధి, నీతి, నిజాయితీలు లేనివారయియున్నారనవచ్చును. కాని, అది సాగించిన పోరాటాలు, సాధించిన విజయాలు, చేసినత్యాగాలు చరిత్రాత్మకమైనవి. అవి ఆనాడు, యీ నాడుకూడ ఆదర్శప్రాయములు. ఈ నాడు సయితం శుష్క విమర్శలకుబదులుగా ప్రజలు కాంగ్రెస్ సంస్థను గతంలోలాగ ఉపయుక్తంగా, మహో

(89 వ-పేజి చూడుడు

కథానిక

# భగ్నహృదయాలు

కుమారి శిరిపురపు విజయ

చలం రాత్రి పదకొండుగంటలకు నెమ్మదిగా రోడ్డు వారగా నడుస్తూ యింటికి వస్తున్నాడు. అతని మనస్సు అనేకమైన ఊహలతో సతమతమైపోతోంది. ఇంటి దగ్గరకి వచ్చాక ఒక నిట్టూర్పు విడిచి నెమ్మదిగా మెట్లెక్కాడు. తలుపుమీద రెండుసార్లు మీటాడు. ఇంతలోకి రాధ ఆలోచనలోనుండి తేరుకుని దిగ్గున లేచి తలుపు తెరిచింది. చలం ఆమె ముఖంవైపుకూడా చూడక తిన్నగా గదిలోకి పోయి బట్టలు మార్చుకుని పడుకున్నాడు. రాధ తలుపు కానుకుని రెండు నిమిషాలు నిలబడి నెమ్మదిగా భోజనానికి లేవండి అంది. అతను లేచి చేతులు కడుక్కుని రెండు మెతుకులు కొరికి చేయికడుక్కుంటాడు. ఆమె ఆ పళ్లెంవైపే చూస్తూ కళ్లు తుడుచుకుంటుంది. రాధ భోజనం చెయ్యకుండానే వంటగది సర్దుకుని వెళ్లి మౌనంగా పడుకుంది. చలం ఒక అరగంట పోయాక 'రాధా! ఇంకా నిద్రపోలా' అని పలకరిస్తాడు. రాధ చలం ఒళ్లో తలపెట్టి బావురు మంటుంది. తాత్కాలికంగా చలం ఆమె నోదార్చి దగ్గరకి తీసుకుంటాడు. ఆ రాత్రి గడిచిపోతుంది. ఈ విధంగా ఎన్నో రాత్రులు, ఎన్నో నెలలు, చివరికి మూడు సంవత్సరాలు గడచిపోయాయి. చలం, రాధ యిద్దరూ అగ్నిసాక్షిగా భార్యాభర్తలయ్యారు. అంతా మంచి జంట అనుకున్నారు. చలం కాలేజీలో డిమాన్‌స్ట్రేటర్‌గా పనిచేస్తున్నాడు. వచ్చే వందా ఇద్దరికీ సరిపోతుంది. రాధ తండ్రి పరిస్థితుల నర్థంచేసుకుని అప్పుడప్పుడు వందో, ఏభయ్యో, పంపుతుంటాడు. చలం తల్లి బలవంతంమీద రాధని పెళ్లిచేసుకోవడం జరిగింది రాధమీద అయిష్టత లేకపోనా అంత మక్కువ చూపించడం కనుపించదు. ఎప్పుడయినా రాధ, చలం సినిమాకి వెళ్లుతుంటే వీధిలో జనం మాత్రం ముచ్చటగా చూస్తుంటారు నవ జంటను. చలం అందగాడు, తెల్లగా, పొడుగ్గా, పొడుగుకు తగ్గ లావుగా వుంటాడు. గ్లాస్కో పంచె లాల్చీ వేసుకుంటే బెంగాలీ బాబులా వుంటాడు. ఇక రాధ చలానికేమీ తీసిపోదు. సాజాగ్గా నవయౌవనంతో మిసమిసలాడుతూ వుంటుంది. ముఖం కోలగావుండి ఎడమబుగ్గన నవ్వినప్పుడు సొట్టపడుతూవుంటుంది. ఆమె నవ్వితే పండు వెన్నెలలా చల్లగా వుంటుంది హాయిగా. అంత అందగత్తె భార్య అయివుంటే ఆమె పట్ల యెందుకంత ముభావంగా వుంటాడో అందరికీ అర్థంకాదు మరి. చలం ఆదోరకమయిన మనిషి. మనసులో ఎలాంటి ఆలోచనా తరంగాలు ఉవ్వెత్తుగా లేచి గందరగోళం చేస్తున్నా ముఖంమీద మాత్రం చిరునవ్వు చిందులేస్తూవుంటుంది. ఆ అందం, ఆ చిరునవ్వు ముఖంచూసి మొగవాళ్లే ముగ్ధులైపోతూంటారు. అప్పుడప్పుడు లెక్చరర్లుకూడా నవ్వుతూ చణుకులువిసురుతూ వుంటారు సరదాగా.

ఒక రోజు—

సరళ లేబొరెటరీలో ఏదో ఎక్స్‌పెరిమెంటుచేసుకుంటూ ఏదో అనుమానం వచ్చి చలాన్ని పిలుస్తుంది. చలం ఆమెకు తెలియని విషయాలు చెబుతూ ఆమెవైపే కళ్లార్పకుండా చూస్తూ నవ్వుతాడు. ఆమెకూడా నవ్వుతుంది. నిజానికి సరళ చలాన్ని ప్రేమిస్తోంది. అతన్ని చూస్తున్నంతసేపూ తన్మయత్వంలో కొట్టుకుపోతుంది. 'ఆరోజు బీచ్‌కి వెళ్తుంటారా చలంగారూ' అని అడుగుతుంది. 'అప్పుడప్పుడు వెళ్తూంటాను' అంటాడు అంతలోకి ఆ ప్రక్కగా ఎవరో రావడంవల్ల వారి సంభాషణ అంతటితో ముగుస్తుంది. చలం కాలేజీ నుంచి బైటికి వచ్చాడన్నమాటే గాని మనసు మనసులో లేదు. సరళే అతని కళ్లముందు మెదులుతోంది. సరళ చూసిన చూపుల్లో మత్తెక్కించేదుంది. ఆ చూపులు తనకి గిలిగింతలు పెట్టినయ్. ఆమె తనని బీచ్‌కి రమ్మందా? లేదే వెళ్తుంటారా అని అడిగింది. ఒకవేళ తనని ఆరోజు రమ్మనే వుద్దేశంతోనే అలా అన్నదేమో! ఏదో కారు హారన్ వినిపించి ఉలిక్కిపడి బాహ్య ప్రపంచంలోకి వచ్చాడు. అప్పటికే తన యిల్లు దాటి వచ్చేశాడు, వెనక్కి తిరిగి యిల్లు

చేరుకున్నాడు. రాధ రేడియో వింటూ యీజీచెయిర్ లో పడుకుని ఏదో చదువుకుంటోంది. చలాన్ని చూసి లేచి లోపలికి వెళ్తుంది. చలం బట్టలు మార్చుకుని ముఖం కడుక్కుని వచ్చేసరికి ప్లేటులో అతనికి అత్యంత ప్రియమైన లడ్లు కనిపిస్తాయి. అయినా వాటివైపేనా చూడకుండా కాఫీమాత్రం తాగి బయటికి పోతున్నాను అని మాత్రం చెప్పి బైటపడతాడు. రాధ ఎంతో ప్రేమతో అతని కిష్టమని చేసింది. కాని అతను తినకపోయేసరికి రాధ హృదయం చాలా బాధపడింది. మంచంమీద వాలి బావురుమని తన దురదృష్టానికి తిట్టుకుంది. తనభర్త తనని ఎందుకింత ముభావంగా చూస్తున్నాడు? ఎంతకాలమిలా కుళ్లుతూ జీవించగలదు? తనలో ఏమిలోపముంది పోనీ ఏదయినా వుంటే తనకి చెప్పకూడదా? తను సరిదిద్దుకుంటుందిగా? చలాన్ని ఆమె అనుక్షణం పువ్వుల్లో పెట్టి పూజిస్తోంది. భర్తకంటే వేరే దైవం లేదనుకుని ఆ దైవం యొక్క ఆదరమే కరువై కుళ్లిపోతోంది. ఆబాధనుండి ఆమె ఎప్పుడు విముక్తి పొందుతుందో!

♦ ♦ ♦

చలం యిసుకలో కూర్చుని సముద్రుడేదో ఆనందంతో ఉప్పొంగిపోతోంటే కారణం కానక ఆ అలలవైపే చూస్తూంటాడు. అంతలోకి ఆలోచనలు సరళమీదికి పోతాయి. సరళరూపం సముద్రపు టలలలాగే అతని మనస్సులో అలలుగా కనుపించింది. అతని హృదయం రెపరెప లాడింది. అతడలా కళ్లు మూసుకుని ఒక్క క్షణం ఆకాశంలో విహరించాడు. కళ్లు తెరచి చూసేసరికి దూరంగా వస్తూ సరళ కనుపించింది. ఆమే, ఆమెతో చెల్లెలు కాబోలు ఒక ఎనిమిదేళ్ల పిల్లా. చలాన్ని చూసి నెమ్మదిగా ఇసుకలోకి వచ్చి నమస్తే అంటూ చలానికి ఒక గజం దూరంలో కూర్చుంది.

చలం "మిస్ సరళా! ఈ అమ్మాయి మీ చెల్లెలా?" అని అడుగుతాడు.

"అవునండీ. లలితా నేను ఇద్దరమే మా తల్లిదండ్రులకు సంతానం"

"లలితా! ఏం చదువుతున్నావమ్మా"

ఇంతలోకి లలిత ఈ ప్రశ్న వినిపించుకోకుండానే "అక్కా! ప్రమీల పిలుస్తోంది. అదుగో! నేవెళ్లి ఆడుకుంటానక్కా!" అంటూ పరుగెత్తుకుపోతుంది.

చలం సరళవైపు చూస్తూంటే సరళ సిగ్గుతో కుచించుకుపోయి "ఏమిటండి. అలా చూస్తారు! నాకదోలాగ వుంది" అంటుంది,

"ఎలా వుంది సరళా?"

"ఏమో!"

"సరళా! నేనొక విషయం అడుగుతాను. సమాధానం యిస్తావా? స్వతంత్రించి అడిగానని మనసు బాధపెట్టుకోకేం?"

"అడగండి నాకు తెలిసినంతవరకు సమాధానం చెబుతాను"

"సరళా! నిన్ను చూస్తూంటే నన్ను నేనే మరచిపోతూంటాను. క్లాసులోకూడా అంతే. అందుకే భయంవేసి నీవైపు చూడకుండా వుండటానికే ప్రయత్నిస్తూంటాను సరళా. నీవు ఎప్పుడూ నా సాన్నిధ్యంలో వుండాలనిపిస్తూంటుంది. నిజంగా నిన్ను ప్రేమిస్తున్నాను సరళా. ఇలా సూటిగా చెబుతున్నందుకు క్షమించు."

సరళ తలదించుకుని ఇసుకలోకి చూపుల్ని ప్రసరిస్తూ పూ మౌనం దాలుస్తుంది. ఏమీ సమాధానం చెప్పదు.

"చలంగారూ! మీకు టాల్‌స్టాయ్ రచనలంటే యిష్టమేనా?" అంటూ సంభాషణ మార్చడానికి ప్రయత్నిస్తుంది. ఇష్టంలేక కాదుగాని కన్యలకు సహజంగా వుండే సిగ్గులోటే ఆ విషయానికి సూటిగా సమాధానం చెప్పలేకపోతుంది. చలం యీ ప్రశ్న వినిపించుకోకుండా ఆమె ముఖంవైపే ప్రేమతో చూస్తూంటాడు. అలా చూస్తూ ప్రపంచమే మరచిపోతాడు. తటాలున సరళ చెయ్యి తన చేతిలోకి తీసుకుని స్పృశిస్తాడు, ఉలిక్కిపడి సరళ తనచేతిని తీసుకుంటుంది. ఆ క్షణంలో ఆ మేదో చెప్పలేని అనుభూతిని పొందుతుంది.

అతనిని చూపులు తనమీద లేనప్పుడు చలం నొక్కులజుట్టునీ, అతని చక్కని కళ్లనీ దొంగతనంగా చూస్తూంటే ఆమెలో ఏవేవో కోరికలూరుతుంటాయి. అతనే తన భర్తఅయితే ఆ తలను తన ఒళ్లోవుంచి ఆ నొక్కులజుట్టులోంచి వేళ్లను పోనిస్తూ ఆ చంద్రుని చల్లని కిరణాల్లోని చల్లదనాన్ని ఆస్వాదిస్తూంటే ఎలావుంటుంది? ఇటువంటి ఊహలతోనే ఆమె మరో ప్రపంచంలోకి పోతుంది. అంతలో లలిత

రావడంతోనే సరళ చలానికి చెప్పి వెళ్లలేక వెళ్లలేక ఇంటికి వెడుతుంది.

ఈ విధంగానే వారి స్నేహం దిన దినాభివృద్ధి పొందుతుంది.

♦ ♦ ♦

ఒకనాడు తన స్నేహితురాలు జానకితో మాట్లాడుతూ అప్రయత్నంగా చలం పేరెత్తుతుంది సరళ. అంతలోకి నవ్వుతూ జానకి "సరళా! కొంపతీసి అతన్ని ప్రేమిస్తున్నావా యేమిటీ! అతనికి పెళ్లయిందమ్మా" అంటుంది సరళని యేడ్పించాలని.

పెళ్లిమాట తెలియగానే సరళ ముఖం నల్లబడింది. ఏమిటి! చలానికి పెళ్లయిందా? అయితే తను..... ఆమె హృదయంలో తుఫాను చెలరేగింది. హృదయం బరువెక్కింది. ఆరోజు మనసు బాగుండక తలనొప్పి వచ్చిందన్న వంకతో యింటికి వెడుతుంది. ఆ రోజంతా చాలా బాధపడుతుంది, కాని ఆలోచించి ఒక నిశ్చయాని కొస్తుంది. అతని రూపాన్ని శాశ్వతంగా మరచిపోవాలి తను. అదే దృఢ నిశ్చయంతో మరునాడు మామూలుగా కాలేజీకి వెడుతుంది. చలం సరళ ముఖారవిందంపై మబ్బు తెరలను గమనిస్తాడు. కాని ఆ రోజల్లా సరళతో మాట్లాడే అవకాశం చిక్కదు, సాయంకాలం కాలేజీ మూశాక యింటికి వెళ్లేటప్పుడు.

"మిస్ సరళా, ఒక్కమాట."

సరళ తిరిగి చూసి తొందరగా ముందుకి అడుగులు వేస్తుంది.

"సరళా! ఆగు. ఒక్కమాట" అంటూ త్వరగా నడిచి ఆమెను చేరుకుంటాడు. ఆమె తలెత్తి అతని వైపు చూడదు.

"సరళా! ఏం జరిగింది కోపంగా వున్నావు? నామీద కోపమా? నేనేమన్నా అనకూడనిది తొందరపడి అన్నానా? నీ మౌనభావం నేను భరించలేను సరళా" అనడంతోనే —

"చలంగారూ! సాయంత్రం బీచిలో కనిపించండి. ఇప్పుడేం చెప్పలేను" అని చరచరా నడిచిపోతుంది.

చలం బాధగా యిల్లు చేరతాడు.

బీచిలో—

"సరళా! ఇప్పుడయినా అసలు సంగతేమిటో చెప్పు. ఎక్కువసేపు నన్ను బాధపెట్టకు."

"చలంగారూ! చెబుతాను. మీరంటే ఒకవిధమైన అభిమానం, నమ్మకం భగవంతుడే కలుగజేశాడు. ఆ నమ్మకంతోనే ఈరోజు అన్నీ చెబుతాను. మీ మనసులోనే వుంచుకుంటానని మాటివ్వండి."

"సరళా! తప్పకుండా నాకూ నీవంటే ఆత్మీయత ఏర్పడింది. నేనూ నీకు చాలా విషయాలు చెప్పాలనుకుంటున్నాను. చెప్పు సరళా, త్వరగా చెప్పు."

"చెబుతాను. నన్నర్థం చేసుకుంటారనే నమ్మకంతో చెబుతున్నాను. ఎవరికీ నా మనసు విప్పి చెప్పలేదింతవరకు. మిమ్మల్ని చూసిన మొదటి క్షణం నుండి నాలో ఇష్టత ఏర్పడింది. మీరు దానిని అనురాగం అనండి, ప్రేమ అనండి, ఏమయినా అనండి. మీ కళ్ళల్లోకి చూస్తూ నా భవిష్యత్తుని ఊహించుకుంటూ మధురంగా వుంటుందని తీయని కలలు కంటూ వుండేదానిని. మీ హృదయరాణినై మన జీవితనౌకను ఆకాశంలోనే నడిపి తారకలను చేరాలనుకునేదానిని. కాని భగవంతుడు నేనా అదృష్టానికి తగని దాననని నా ఆశలని మొదటిలోనే త్రుంచివేశాడు. నా జీవితం మోడులానే వుండాలని రాసిపెట్టివుంది కాబోలు. నేనందుకోలేని వాటికొరకు అర్రులు చాచటం నా పొరపాటే. ఇప్పటికి నా పరిస్థితి నాకర్థమయింది. నేను కన్న కలలే మధుర క్షణాలు నా జీవితంలో, అంతే. ఇంక నాకేమీ అవసరంలేదు. నా చెల్లాయిని, అమ్మని పోషిస్తూ నా బాధ్యతను నిర్వర్తించుకుంటాను. ఆ ఆత్మసంతృప్తయినా నాకు మిగులుతుందేమో చివరికి" అంటూంటే సరళ చెక్కిళ్ళపైనుండి కన్నీరు జలజలా రాలిపడ్డాయి.

చలానికి యిదంతా వింటూంటే ఏ నరకంలోనో వున్నట్లనిపించింది. తనీ ప్రపంచంలో వున్నానా, లేనా అనికూడా సందేహం వచ్చింది.

"సరళా! ఎందుకింత బాధపడుతున్నావు? నేను నిన్ను ఎంతగా ప్రేమిస్తున్నానో తెలుసా. కావాలంటే నా హృదయాన్ని చీల్చి చూడు సరళా. సరళా! నిజంగా నిన్ను చూడని క్షణం ఒక యుగంలా వుంటుంది. కన్నుమూసినా, తెరిచినా నువ్వే కనిపిస్తున్నావ్ సరళా. నా మాటల్ని నమ్మలేవా సరళా? నా నిజాయితీని, నా హృదయాన్ని శంకిస్తున్నావా? కావాలంటే నా హృదయాన్ని చీల్చిచూడు సరళా, సరళా!" అంటూ ముఖాన్ని రెండు చేతుల్లోకి కప్పుకుని కుమిలిపోతాడు.

"ఒక విషయం అడుగుతాను, నిజం చెబుతారా?"

"అడుగు సరళా, నీ దగ్గర నేనేమీ దాచనని ప్రమాణం చేస్తున్నాను."

"మీకు పెండ్లయిందా? ఆమె యిక్కడే వున్నారా? ఒక్కసారి అనలేదే!"

ఈ ప్రశ్న విని ఒక్క నిట్టూర్పు విడుస్తాడు చలం. ఒక నిముషంలో అతని ముఖంలో రంగులు మారాయి.

నెమ్మదిగా "సరళా, అంతా చెబుతాను. నేనత్యంతంగా ప్రేమించే మా అమ్మమీద ఒట్టేసి చెబుతాను. ఇంతవరకు ఎవరికీ చెప్పాలనిపించలేదు. ఎన్నో రోజులనుండి నీలాంటి వ్యక్తికోరకు వెతికాను. చివరికి నిన్ను చూడగానే గమ్యం చేరాననిపించింది. నా హృదయం విప్పి నీ పాదాలముందు పెడతాను. ఇంతవరకు నా జీవితంలో నిజమైన ఆనందాన్ని పొందలేదు, ఇంతవరకు నేను ఆనందం అనుకున్నదంతా భ్రాంతి. నేను చిన్నతనంలోనే తల్లిని కోల్పోయాను. నాన్నే నన్ను కంటికి రెప్పగా పెంచాడు. అతిగారాబంగా చూశారంతా. ఇంట్లో అన్నయ్యలతోసహా అలానే చూశారు. నేనాడిందే ఆటగా, పాడిందే పాటగా సాగింది కొంతకాలం. నేను కాలేజీలో చేరేసరికి మంచి చెడు విచక్షణే మరిచాను. అదంతా చుట్టూ చేరిన స్నేహితుల మహిమ. నైతికంగా చాలా దిగజారాను. పడుచుది కనిపిస్తే నా మనసు రెపరెపలాడేది. మనస్థిమితం వుండేది కాదు. చేయకూడని పనులు చేశాను. ఆ సమయంలో నాకు మనోధైర్యం లేకపోయింది. నన్ను భగవంతుడు కూడా క్షమించడు సరళా. నాన్నగార్కి చూచాయగా సంగతులు తెలిశాయి. మా మేనత్త కూతురు రాధ. రాధతో నాకు పెళ్లి నిశ్చయం చేశారు. అయినా నా భార్యగా ఆమెకు మనస్ఫూర్తిగా హృదయంలో స్థానం ఇవ్వలేకపోయాను. ఇవ్వలేకపోతున్నాను. చాలా ప్రయత్నించి కూడా విఫలత చెందాను సరళా. మిగతావాటిలో రాధకి నేనే లోటూ చెయ్యలేదు. సరళా! నిన్ను చూచాక నీవే రాధ స్థానంలో వుంటే నా జీవితం ఎంత ఆనందంగా వుండేదో ఆలోచించుకుంటే ప్రపంచాన్ని మరచిపోయేవాడిని. కాని అది అసంభవమేమోనని పించేది. సరళా! ఈ విషయాలన్నీ నేనే నీతో చెబుదామనుకుంటున్నాను. ఇప్పుడీవిధంగా చెప్పవలసివచ్చింది. నన్నర్థం చేసుకో సరళా. నేనేం చెయ్యను చెప్పు?" అంటూ మోకాళ్ళమీద తల పెట్టుకుని కుమిలిపోయాడు చలం.

సరళ కన్నీరు తుడుచుకుని "చలంగారూ! ఉద్రేకంలో దూరం ఆలోచించలేకపోతాం. కాని నిదానంగా ఆలోచిస్తే మార్గం గోచరించకపోదు. పశ్చాత్తాపమే మనసుని నిర్మలంగా చేస్తుంది. నేను మీకిచ్చిన స్థానానికి చలనం వుండదు. అది శాశ్వతం. కాని రాధకు మాత్రం అన్యాయం చెయ్యలేను. ఆమె మిమ్మల్ని దైవంగా ప్రేమిస్తోంది. అది మీరు కాదనగలరా? సంఘంలో స్త్రీకయినా పురుషునికయినా కావలసింది గృహస్థ జీవితం. దానిలో ఎన్ని కష్టసుఖాలెదురయినా ఆనందంగా అనుభవించాలి. క్షణికమయిన సుఖానికి బానిసలైపోవటం సహించరానిది. చలంగారూ! నేనేమేమో చెబుతున్నానని కోపగించుకోకండి. మీకన్నీ తెలుసు. మిమ్మల్ని వేడుకుంటున్నాను. నేనంటే మీకెంతో అభిమానమన్నారు. అదే నిజమయితే నాకు మాటివ్వండి. రాధ నన్యాయం చేయకండి. రాధకి మీ హృదయంలో చోటివ్వండి" అంటూ అప్రయత్నంగా చలం రెండు చేతుల్ని పట్టుకుని అర్థించింది. చలం ఆ చేతుల్ని హృదయానికి హత్తుకుని "సరళా! నాకీ సంతృప్తికూడ లేకుండా చేస్తావా? ఏమీ లేకుండా ఈ ప్రపంచంలో నేనెలా బ్రతికేది సరళా."

"చచ్చి సాధించేదేమీలేదు. నాకొకసారి రాధని చూడాలని వుంది. నేనడిగినదానికి సమాధానం చెప్పండి. మీరు నా మాటకి సమాధానం చెప్పకపోతే ఇహ మీకు సరళ ఎప్పుడూ కనుపించదు. చెప్పండి. చేతిలో చెయ్యి వెయ్యండి."

"సరళా! ఇదిగో నీకోసం ఏమి చెయ్యమన్నా చేస్తాను. నా జీవితాన్నే అర్పిస్తాను. నీ ఇష్టప్రకారం రాధని ప్రేమించటానికి ప్రయత్నిస్తాను. అంతే. అంతకంటే నేనేమీ చెప్పలేను సరళా" అంటూ ఇహ అక్కడ వుండలేక లేచి తిరిగి చూడకుండా బరువుగా అడుగులు వేస్తూ వెళ్ళిపోతాడు.

సరళ కళ్ళు తుడుచుకుని బరువెక్కిన హృదయంతో యింటికి వెళ్తుంది.

అదే చలం జీవితంలో మరువరాని రోజు. రాధ జీవితంలో మార్పు రాసాగింది. నవ వసంతాలు

తొంగిచూచాయి. కాని చలం సరళని హృదయంలో పదిలపరుచుకున్నాడు. దాన్ని ఎవరూ కదిలించలేరు. భగవంతుడు కూడా.

రోజులు గడుస్తున్నాయి.

కొన్ని సంవత్సరాల అనంతరం –

ఇప్పుడు చలం లెక్చరర్. చలం - రాధలకు ఒక కొడుకూ, ఒక కూతురూ. చలం కుటుంబసమేతంగా తిరుపతి వెళ్ళాడు. దేవుని దర్శనం చేసుకుని తిరిగి వచ్చేటప్పుడు అనుకోనివిధంగా సరళ!!!...సరళే... సందేహంలేదు. సరళా, ఒక నలుబది ఐదేళ్ళ పెద్ద మనిషీ, ఒక పన్నెండు సంవత్సరాల అమ్మాయి దైవదర్శనం కొరకు వెళ్తున్నారు. సరళని చూడగానే చలానికి తల తిరిగినట్లయింది. తమాయించుకొని ఔనా కాదా అని మళ్లా చూశాడు. సందేహం లేదు. సరళే అయితే ఆయన...? భర్తేమో! సరళ ముసలతన్ని పెండ్లాడిందా? జీవితాన్ని పరుల సుఖం కోసం బలిచేసిందా? ఏమిటీ విపరీతం –

దగ్గరకి వచ్చేసరికి ఆయనని ఎక్కడో చూసినట్లనిపించింది చలానికి. అవును, ఆయన రంగనాథరావు గారు. తెనాలిలో డాక్టరు.

"నమస్కారం డాక్టరుగారూ మేము తెనాలిలో మీ యింటిప్రక్క నుండేవారమండీ. నేను చలాన్ని"

"అవునోయ్. మరచిపోయానేమోనని జ్ఞాపకం చేస్తున్నావా? ఇంకా అంత మతిమరుపుతనం రాలేదు. అంతా బాగున్నారా? ఏమిటి చేస్తున్నావిప్పుడు? ఇద్దరు పిల్లలన్నమాట. గట్టివాడవే!"

"నేను అనంతపురంలో లెక్చరర్ గా వుంటున్నానండి. మీరు... ..."

"నేను తెనాలిలోనే వుంటున్నాను. కాంతం... అంటే నా భార్య పోయాక మనస్తిమింతలేక కొంత కాలం ప్రాక్టీసు మానివేశాను. చాలామంది మళ్లీ పెళ్లిచేసుకోమన్నారు కాని నా కిష్టంలేకపోయింది. నా శశిని చూసుకుంటూ బ్రతికితే చాలనిపించింది. కాని భగవంతుడు ఏమి చేయాలనుకుంటాడో మన కేమి తెలుసు? అదృష్టంకొద్దీ సరళ నా భాగ్యదేవతై నాయింటి కొచ్చింది. చదువుకున్నా యిప్పటి పిల్లల్లా కాక తన జీవితాన్నే మా శ్రేయస్సుకోసం ధారపోయడానికి నిశ్చయించుకుని నా గృహదేవతయింది. ఏమిటో అంతా అలా జరిగింది. భగవంతుని లీలలు మనికి అర్థంకావు."

చలం ఒక నిట్టూర్పు విడిచి సరళవైపు చూశాడు. సరళ అదే సమయానికి తల ప్రక్కకితిప్పుకుని కన్నీరు తుడుచుకోవడం అతని దృక్పథంలోంచి తప్పించుకోలేకపోయింది. అతనికిఒక్క క్షణం అంతా అంధకారమయినట్లయింది. కళ్లు తెరిచి చూసేసరికి రంగనాథరావుగారు ముందుకి సాగిపోయారు కుటుంబ సమేతంగా.

# ఐతరేయోపనిషత్తు

## పూజ్యపాద స్వామీ చిన్మయానందులవారి వ్యాఖ్యానములు.

అనువాదము: Dr. W. రాధాకృష్ణయ్య

(గతసంచిక తరువాయి)



ఇంద్రియ కరణములను సృష్టించుట, ఇంద్రియముల తృప్తికొరకు కాదు. ఇంద్రియములకన్న వ్యతిరిక్తముగనుండి, వాటిని నియమించు స్వామికొరకు అవి సృష్టింపబడుచున్నవి. ఒక గృహమును, నిర్మించుట గోడల, స్తంభముల సౌకర్యముకొరకు కాదు. దూలములు పడకుండుటకు కాదు. దానిలోని నేలమట్టమును రక్షించుటకు కాదు. గృహమునకన్న వ్యతిరిక్తముగనుండు యజమానుని సౌకర్యము కొరకు గృహము నిర్మింపబడుచున్నది. యజమానుడు సుఖముగనుండుటకు, లోనప్రవేశించవచ్చును. అవసరమేర్పడినపుడు బైటవెళ్లవచ్చును. అదే విధముగ, నేను లేకున్నచో, ఈ ఇంద్రియకరణము లెట్టి తృప్తిని పొందజాలవు, వాటిసృష్టి వ్యర్థముగనుండును.

శ్రు॥ స పిత మేవ సీమానం విదార్యై
తయా, ద్వారా ప్రాపద్యత. సైషా
విదృతి ర్నామ. ద్వాస్త దేత న్నాన్ద
నమ్. తస్య త్రియ ఆవసథా, స్త్రయః
స్వప్నా,, అయమావసథో౽ యమావ
సథో౽ యమావసథ ఇతి.॥ (12)

[అపుడతడు కపాలమును తెరచి, ఆద్వారమున ప్రవేశించెను. ఈద్వారమునకు విదృతి (చీలిక) అని పేరు కలిగెను: ఇది ఆనంనిలయము. నాందన – అతనికి మూడు నివాసములు కలవు. మూడుస్వప్నములు కలవు. (నేత్రము) ఇదియొక నివాసము. (కంఠము) ఇదియొక నివాసము, (హృదయము) ఇది యొక నివాసము.]

ఈ శరీరమునబడుకోటను ప్రవేశించుటకు యోగ్యమగు ద్వారమును గూర్చి అతడు యోచించి, దేహమునకు మకుటమువంటి కపాలము ద్వారా అతడు లోనికి ప్రవేశించెను. శరీరనిర్మాణమున అంగవికాసములందు, కపాలము అతిపావనమగు స్థలమని చెప్పవచ్చును. పసిబిడ్డల శిరమున, ఎముకలపుర్రెయందు మధ్యభాగమున మృదువగు స్థలమును చూచుచున్నాము. అందునాడి చలించుట తెలియుచున్నది. వేళ్లతో తాకిన, మెత్తని పల్లముండుట తెలియును. ఆ భాగమును యిచ్చట వర్ణింపబడుచున్నది. అచట బాహ్యము నుండి కలుగు అపాయముల తొలగించుకొను రక్షణలేకున్నది. పెద్దవారియందు ఆ పల్లము కనబడదు. ఎముకలు పెరుగుటవలన, అదిగట్టిపడుచున్నది. అదియే కపాలము. అదియే విదృతి. దానిద్వారా ప్రభువు లోనికి ప్రవేశించెను. అనగా, మానవునియందుండు పవిత్రశక్తి, జ్ఞానము – ఎఱుక – ఈ కపాలద్వారమున ప్రవేశించెను.

ఇచ్చట ప్రవేశించుట అనగా, వ్యవహారరీతి ప్రవేశించుటకాదు. మనములేని ప్రదేశమున మనము ప్రవేశించగలము. ప్రక్కగదియందు నేనులేను. ఆ గదియందు నేను ప్రవేశించగలను. నేను కూర్చునియుండు గదిలో నేను ప్రవేశింపజాలను. ఇచ్చట సర్వవ్యాపకత్వము (యుగపద్దర్శనము), ఏకకాలమున సర్వ ప్రదేశములందు దర్శనమొసగగలశక్తి వర్ణింపబడుచున్నది. ఒకభూతము సృష్టింపబడెను. ఆభూతము యొక్క స్థాణువును ప్రవేశించెను. అట్లుప్రవేశించుటను భ్రమకలమానవుడు చూచెను – అకట నమ్మదగని వెఱ్ఱితనము. భూతమునకాధారముగనుండు స్థాణువును గుర్తెరిగినవ్యక్తి ఇట్టిమాటలవలన ప్రమాదము పొందడు. ఒకకమ్మరి యొకకుండను తయారుజేసి, దానియందు ఆకాశమును ప్రవేశపెట్టుటలేదు. నిజముగ కమ్మరి ఆకాశమున కూర్చునియున్నాడు. మట్టిముద్ద ఆకాశమునయున్నది. చక్రము ఆకాశమున తిరుగుచున్నది. కుండ ఆకాశమునందే తయారగుచున్నది. అది ఆకాశమును మూయుచున్నట్లు కనబడుచున్నది.

అదేవిధముగ, సృష్టి విచారకథయందు, శరీర ఆకారనిర్మాణము, ఇంద్రియ కర్తృత్వ ప్రవేశము,

ప్రాణప్రవేశకథ, జ్ఞానశక్తి ప్రకాశము, క్రమముగ గురువువర్ణించుచున్నాడు. వస్తు పరిశోధక శాస్త్రమున గాని, రసాయనశాస్త్రమున గాని, విషయములను వరుసక్రమమువదలక తెలుపబడును. ఒక వస్తువు ఇతర వస్తువు ఇతరవస్తువులతో, వివిధ పరిస్థితులందు కలసినపుడు ప్రదర్శించు గుణభావములను, శిష్యులు చక్కగ గ్రహించి, శాస్త్రవిచారకాల పర్యంతము జ్ఞప్తియందుంచుకొనవలసియున్నది.

శరీరము సత్యమున నిర్మాణింపబడెను. సత్యమున అస్తిత్వము పొందుచున్నది. సత్యమున వ్యవహరించుచున్నది. సత్యముచే కప్పబడియున్నది. అణువణువున సత్యము వ్యాపించియున్నది. శరీరము జన్మించునప్పుడు కేవల నవాకార మొకటి పుట్టుచున్నది. నెలలు జరిగి, వృద్ధిపొందుకొలది, చేష్టలు కలుగుచున్నవి. వీటిలో వాక్కు మొదట కలుగుచున్నది. సంభోగవాంఛ కడపట కలుగు గుణముగనున్నది. దీనిని బట్టి మాదగా తొలుతవర్ణించబడిన విరాట్పురుషుని వర్ణనయందు తెలుపబడిన వివరమున, క్రమమున, అధిక అంతరార్థము, నిశ్చితప్రయోజనమున్నదని తెలియుచున్నది.

ఇంద్రియ శక్తులు ప్రదర్శనమగుటయందు క్రమముగ, వాక్కు ఘ్రాణము, దృష్టి, శ్రవణము, స్పర్శరూపములు, మనసు, అపానము (అన్నమునులోనికి మింగగలశక్తి), కడపటశిశ్నము, వీర్యము, కలిగినట్లు తెలుపబడినది. వీటివెనుక, వ్యక్తిగత అభివృద్ధి సంపూర్ణముగ ఏర్పడినవెనుక, అతనియందు జ్ఞానము (ఎఱుక) ప్రకాశించుచున్నది. ప్రాణశక్తివలన శరీర నిర్మాణము, వ్యవహారశక్తులు కలుగుచున్నవి. పిమ్మట జ్ఞానశక్తి ప్రకాశించుచున్నది. కనుక ఇందుకనబడు వరుసక్రమము శాస్త్రసమ్మితముగ, భావగర్భితముగనున్నదని యొప్పుకొనవలెను.

ఈ జ్ఞానప్రకాశ – ఎఱుక – యే ఆనంద స్వరూపము ఆ యానందము, మాంసమయ శరీరమును, కపాలము ద్వారా ప్రవేశించెను. కనుక ఆద్వారమును నాన్దనము అనబడును. ఇది ఆనందనిలయము. కనుక దీనినిశంకరులు, నన్దనమని తెలిపియున్నారు. నకారము నకు వేదఛందసువలన దీర్ఘమేర్పడుటచే. "నాన్దన" మయినది. మనదేశమున గొప్ప నగరములందు, ఇండియాగేట్టు అని, కాశ్మీరుగేటని, యుండునట్లు, పరిపూర్ణ దివ్య ఎఱుక. ఈ మాంసమయి దేహమును ప్రవేశించిన ద్వారమును, మహాద్వారమును. "నాన్దనము"ని తెలుపుట చక్కని పేరుగనున్నది.

పరిపూర్ణ దైవస్వరూప ఎఱుక, ఈ మాంసమయ శరీరము నీరీతి ప్రవేశించి, అంతరమునందుండి, సర్వ వ్యవహారముల నెఱుగుచుండినచో, మనకు ప్రత్యక్షముగ తెలియుటకేల ? యని శిష్యునికి సందేహము కలుగుచున్నది. సూక్ష్మబుద్ధిగల శిష్యులు, కొందరి ఎఱుకను కొద్దిగనో, గొప్పగనో దర్శించగలస్థానమేది యని వెదుకగలరు. ఈ గురువులవద్దచేరిన శిష్యులు బానిసలవలె, గురువాక్యములను మింగువారుకారు. వారికికలుగు సందేహములను నిస్సంకోచముగ గురువులకు నివేదించగలుగు చుండిరి, కనుక పరమాత్మ ఈ స్థూలశరీరమును ప్రవేశించెనను గురువాక్యముల నమ్మగలిగినను, తమ సందేహములను వదలలేదు.

కనుక, గురువువారి సందేహములను ముఖచిహ్నములవలన గుర్తెరిగి చక్కని తర్కసమ్మతమగు సమాధానము తెలిపి, శరీరమునందు పరమాత్మనివాసముల నిర్ణయించదొడగెను. "అతనికి నివాసములు మూడు. అవస్థలుమూడు. అని గురువు తెలుపుచున్నాడు. జాగ్రత, స్వప్న, సుషుప్తులు మూడును అతనికి, అవస్థలు అని భాష్యకారులు తెలిపియున్నారు. ఈ మూడవస్థలందు, ఎఱుకప్రకాశముకలదు. జాగ్రత ప్రపంచమును, జాగ్రతయందనుభవించుచున్నాము. దీనిని మనము తెలుసుకొనుచున్నాము. స్వప్నమునందు, స్వప్న ప్రపంచమును, ఆందలి అనుభవములను తెలుసుకొనుచున్నాము. పైరెండవస్థలందు గల విషయములను వాటినుండికలుగు అనుభవములు సుషుప్తియందులోపించుట తెలుసుకొనుచున్నాము. ఇట్లు ఈ మూడవస్థలయందు సమముగ, ఎఱుకయై వ్యవహరించు సామాన్యాంశమును ఆత్మయని, సత్య స్వరూపమని, ఆయాత్మ ఈశరీరమును ప్రవేశించెనని తెలుపబడినది.

విశ్వ, తైజస, ప్రాజ్ఞుడని, జాగ్రత, స్వప్న, సుషుప్తులందు ఆత్మవ్యవహరించుట తెలుపుటేగాక, ప్రతి అవస్థయందును, ఆ ఎఱుకకుగలనివాసమును తెలుపబడుచున్నది. ఇందుగల వాక్యార్థములను పాఠకులు గమనించకూడదు. ఇవన్నియు, సృష్టిక్రమమునొక దానిని కల్పించి తెలుపుటకుపయోగించబడినక్రమరీతులు. ఇందు ప్రమాదములకాస్పదము లేకుండుటకై, గురువు ప్రారంభమునసే," మొదట, అద్వితీయ ఆత్మయొకడేయుండెను. "అను సత్యవాక్యముతో, తనయుపదేశమును మొదలుపెట్టియున్నాడు., పిమ్మట, తనవర్ణనక్రమము సమర్థించుటకు, ఆరోప

అపవాద, మనబడు తర్క-నీతులనుపయోగించుచున్నాడు. ఈ వర్ణనమునందు లోపములేకుండుటకు, ఆత్మకు నివాసస్థలములు మూడున్నవని తెలుపుచున్నాడు. గురువుబోధించునపుడు తన చూపుడు వేలితో ఆస్థలములను చూపెనని గ్రహించవలెను.

ఆకాలమున ఆత్మనివాసస్థలముల పరిజ్ఞానము సర్వసామాన్యజనవిదితమై యుండెను. రైతు, కుమ్మరి, సాలెవాడు, ప్రతిగృహస్థుడు తెలుసుకొనియుండెను. ఈమూడవస్థలందు మన అహంకారపూరిత ఎఱుక, విశేషించి ప్రకాశించుస్థలములను గురువు వేలితో చూపుచున్నాడు, జాగ్రతయందుకుడి నేత్రమున్ను, స్వప్నమునకంఠము, సుషుప్తియందు హృదయము, ఆత్మనివాసములని శంకరులు తెలిపియున్నాడు.

జాగ్రతయందు మనకుడి నేత్రమున అత్యధిక అహంకారభావముకూడియుండుట ప్రత్యక్షముగ, మనమనుభవించుచున్నాము. ఒక నేరస్తునికి, శిక్ష విధించి, అతని కాలు చేతులలో నేదోయొకటి ఛేదించునట్లాజ్ఞాపింపబడినచో, అతడు కాలికన్న చేతిని రక్షించుకొనయత్నించును. ఆ చేతులలో, సర్వకార్యములకుపయోగపడుకుడి చేతిని రక్షించుకొని, ఎడమ చేతిని త్యజించనిచ్ఛగించును. నాసికనో, నేత్రమునో నొకదానిని త్యజించవలసి యుండినచో, నేత్రమును రక్షించుకొనును. రెండు నేత్రములలో కుడికంటిని రక్షించుకొనుచున్నాడు.

ఈరీతి మనము శాంతముగవిచారించగలిగినచో, మనముత్యజించ సాహసించు అంగములను ఎన్నుకొనుచు, తుదివరకు మనకుడి నేత్రమును రక్షించుకొన ప్రయత్నింతుము. అందువలన, జాగ్రతకాలమందు కుడికంటియందు అహంకారము ఒత్తిడికలిగియున్నదని తెలియుచున్నది. ఇదేవిధముగ, యోగశాస్త్రము వలన. స్వప్నకాలమున, స్వప్నవహార అహంకారము, కంఠమునందధికముగ ఒత్తిడి పొందుచున్నదని తెలుపుచున్నది. సుషుప్తియందు వ్యక్తియొక్క వ్యవహారములన్నియు ముకళించుకొని, హృదయాకాశమున ఇమిడియుండునని తెలియుచున్నది.

ఈక్రమమున, శిష్యుల సంశయములకు, సమాధానములు తెలుపబడుచున్నవను విషయము మరువరాదు, శ్రుతివాక్యములరీతి, ఆత్మాంశము శరీరమును ప్రవేశించి యుండినచో, ఏప్రదేశములందది వసించుచుండును? మానవుడనుభవించు మూడవస్థలందు ఆత్మ ఎఱుక ప్రకాశించుచున్నది. ఈ మూడవస్థలందు, ఆయా అవస్థల అనుభవములను మనము తెలుసుకొనుచున్నాము, ఆత్మ ఎఱుక యనగ, వ్యక్తితన జాగ్రత, స్వప్న, సుషుప్తులందలి విషయములను అనుభవించగలశక్తి. విషయానుభవముల స్పర్శపొందుటే ఆత్మ ఎఱుక.

“తస్య” ఈ అవస్థలు, ఈ నివాసములు అన్నియు, ఆత్మసంబంధమైనవి. రాముని గేదె అనగా, రాముడు పెంచుచున్న గేదెయని తెలియుదుము కాని రాముడే గేదెయని తలచము. షష్టివిభక్తియుపయోగించునపుడు విషయమునకు విషయికి, ప్రత్యక్షభేదము కనబడుచున్నది. ఇచ్చట అవస్థలు, నివాసములు, ఆత్మవి. ఆత్మయొక్క అవస్థలు నివాసములు, అతనికి విషయములు. ఆత్మ యజమానుడు. అవస్థలు, నివాసములు అతనివశములు. జాగ్రత, స్వప్న, సుషుప్తులు, జ్ఞానములుకావు. జ్ఞానము వీటియందు వ్యవహరించుచు, వాటికిగల ప్రత్యేకభావములను, గౌరవములను ప్రకటించును.

శు.॥ స జాతో భూతా న్యభి వ్యైఖ్యత్ కి
మిహాన్యం వావ దిషదితు. స ఏ తమేవ
పురుషం బ్రహ్మ తత మపశ్యత్
ఇద మదర్శమితీ 3. ॥ (13).

[అతడు పుట్టిన వెంటనే నలువైపుల విషయములను చూచెను. జీవరాశులను తేరిచూచెను. ద్వితీయ విషయమునుగూర్చి అతడెట్లు ప్రశంసించగలడు. “ఆత్మకు అన్యముగనుండు విషయమేదైన యుండిన దానిని గూర్చి ప్రశంసించగలను.” తన కన్యముగ ఏ విషయమును గూర్చియు అతడు ప్రశంసించలేక పోయెను. పరబ్రహ్మము - పురుషుడొకడే - సర్వమునువ్యాపించియుండుటను అతడుచూచెను. ఆశ్చర్యముతో “అహా! దీనిని నేను చూచితిని” అని తలచెను.]

(సశేషము)

# మాతృమూర్తి

శ్రీపాద లక్ష్మీనారాయణ మూర్తి

ఎన్నెన్నో లోకాలను
ఎన్నాళ్లో గాలించితి
నిన్ను బోలు వారెవరూ
కన్నుల బడలేదమ్మా

చందమామ వెన్నెలలో
ఉండెంతో హాయి యంచు
విందుగాని నీ పలుకుల
ముందదేమి ఎక్కువమ్మ?

సెలయేరుల పాటలలో
మలయానిలు బాటలలో
విలసిల్లని ఆనందం
కలదమ్మా నీ పలుకుల

కోవెలలో చీకటింటి
దేవుడు కలడంచు జనులు
భావింతురు నీ కన్నా
దేవత నాకెవరమ్మా?

ఏ చదువులు చదివిననూ
ఏ చోటులు తిరిగిననూ
నీ చల్లని చూపే నను
బ్రోచుచుండు నిజమమ్మా

నీ చూపుల వెలుగులలో
వాచామృత ధారలలో
ఏ చీకటులైన తొలగు
తోచు గదా దివ్యత్వము

నడువ నేర్పి నుడువ నేర్పి
తడ బడుచో ధైర్యమిచ్చి
పడు చుండిన నీ చిక్కులు
గడన చేయ వేలమ్మా.

ఏపూజ లొనర్చితినో
నాపుణ్యవశాన నీకు
పాపనై జనించి నాను
కాపాడుము కన్న తల్లి!

కథానిక

# సుశ్రీ - శశ్రీ

మాధురి

"డాక్టర్ శేఖర్! మీకు ఫోన్ కాల్ వచ్చింది!" ఎత్తు మడమల బూట్లు చప్పుడు చేసుకుంటూ వచ్చి చెప్పింది నర్సు.

"ఊఁ...ఎక్కడినుండి?" తలెత్తకుండానే కేసు రికార్డ్సు చూస్తూ అన్నాడు శేఖర్.

"మిసెస్ శేఖర్!" అంది చిన్నగా నవ్వుకుంటూ వెళ్ళిపోయింది.

గాలికెగరకుండా కాగితాలమీద పేపరు వెయిట్ పెట్టి చకచకా నడిచాడు ఫోనువద్దకు.

"హలో...రాగిణీ! నేను నీ శేఖర్ని మాట్లాడుతోంది!" చిన్నగా అన్నాడు.

"నా శేఖర్...కాదు డాక్టర్ శేఖర్!" చాలా బాధగా పలికింది రాగిణి.

"రాగిణీ!" అన్నాడు ఉద్రేకంగా. "అలా బాధపడుతావేం. అక్కడున్నా, ఇక్కడున్నా నా మనస్సంతా నీ దగ్గరే వుంటుంది. అయినా అయిన దానికి అలా బాధపడుతూ కూర్చుంటే ఏం లాభం చెప్పు. ఇంకా ముందు ఎన్ని కష్టాల నెదుర్కోవాలో మనకేం తెలుసు...ఛీ! ఏడుస్తున్నావా?...గతించిన విషయాలు మర్చిపోవటం మంచిది రాగిణీ! ఆ బాధతోటే మనస్సంతా ఎందుకు పాడుచేసుకుంటావు? ఎప్పుడూ ఏదో ఒక పుస్తకం పట్టుకొని బాధ మరిచి ఎందుకు కూర్చోకూడదు?"

అవతల ఫోను పెట్టిన శబ్దమయింది. బాధగా నిట్టూర్పు విడిచాడు శేఖర్. ఫోను పెట్టి తిరిగి తీసుకొని తన యింటికి కనెక్టు చేయమన్నాడు.

"రాగిణీ!" అన్నాడు చిన్నగా.

"రోజూ చెప్పేదేగా?" అంది.

చిన్నగా ఏడుస్తున్న శబ్దం ఇంకా వినిపిస్తూనే ఉన్నది శేఖర్కి.

"రాగిణీ! నేను యింకో పావుగంటలో వస్తాను. టాయిలెట్ అయి రెడీగా వుండు. సినిమాకు వెళదాం!" ఫోను పెట్టేశాడు. తనకు తెలుసు రాగిణి నుండి సమాధానం "రాలేను!" అని వస్తుందని.

గడియారం ఐదు తరువాత అరగంట కొట్టింది. తరువాత డాక్టర్ రఘు డ్యూటీలోకి వచ్చి శేఖర్ని రిలీవు చేశాడు. కోటును బుజాన వేసుకొని బయల్దేరాడు బయటకు శేఖర్.

తలుపు దగ్గరకు వచ్చేటప్పటికి డాక్టర్ రఘు గొంతు వినబడింది.

"డాక్టర్ శేఖర్..."

అతను వెనక్కు తిరిగాడు. ముందుకు చూచాడు కాని నడవలేకపోయాడు

"...మీరు మర్చిపోయారు డాక్టర్!"

శేఖర్కు దగ్గరగా వచ్చాడు చేతిలో చిన్న ఫోటోతో. అతని చేతికందించాడు.

"మీ సుశ్రీ దేనసుకొంటాను?"

"థాంక్యూ!" శేఖర్ కంటివెంట రెండు కన్నీటి బొట్లు రాలాయి.

"ఇంకా మీరు బాధపడుతూనే వున్నారా డాక్టర్?" రఘు చిన్నగా తలవంచుకొని అడిగాడు.

"మనుషులు పోయినా మమతలు పోలేవని నాకు తెలుసు...కానీ మీరే అలా బాధపడితే...డాక్టర్.. ఫోటో నలిగిపోతోంది."

గట్టిగా మూసిన శేఖర్ గుప్పిటనుండి ఫోటో కొనలు బయటకు కనిపిస్తున్నాయి.

"థ్యాంక్యూ డాక్టర్! ప్రయత్నిస్తాను...నేనే బాధపడితే నా రాగిణేమౌతుంది?" చిన్నగా గొణుక్కుంటూ కారువద్దకు నడిచిపోయాడు శేఖర్.

కారులో పోతుంటే ఎన్నో పాతజ్ఞాపకాలు రోడ్డుమీద జనం ఎదురయినట్లే వస్తున్నాయి. "తన మనస్సును తన గుప్పిటలో పెట్టుకోలేడు. తను గతించిన కాలాన్ని గతించినట్లుగా తలంచలేడు...తనూ

మనిషే...తనలో దేవత్వం లేదు...లేదు...సుశీ! లేదు. "నిన్నూ మీ నాన్న ఎన్నడూ మర్చిపోలేడు. మర్చిపోనీయదు నీమీద ప్రేమ సుశీ "అతని బుజాల మీదగా సుశీ వంగి మెడ వాటేసుకున్నట్లుగా ఫీల య్యాడు. నిజంగా సుశీ ఆ కారులో ఉంటే అలాగే చేసి వుండేవాడు!...

శేఖర్ మెడిసన్ చదువుతున్నపుడే రాగిణిని పెండ్లి చేసుకున్నాడు. పెండ్లికూడా చాలా ఆడంబ రంగా జరిగింది. తను కలయింటివాడు...రాగిణీ అంతే!

తను మెడిసన్ పూర్తిచేసి ఉద్యోగంలో జేరగానే రాగిణిని తీసుకొచ్చి మంచి యిల్లు అద్దెకు తీసుకొని కాపురం పెట్టాడు. చాలా ఆనందంగా గడిచిపోయి నయి ఐదు సంవత్సరాలు. ఆరునెలలు రాగిణి తనకు వియోగం కలిగించినప్పటికి పండంటి పసిబిడ్డతో తిరిగి వచ్చింది పుట్టింటినుంచి.

శేఖర్ ఎంతో ఆనందించాడు. సుశీని ఎంతగానో ప్రేమించాడు. పిల్లవాడికి ఎంత ఆనందం చేకూర్చాలో అంతా చేకూర్చారు. డబ్బుకు వెనుకాడలేదు. రాగిణి సుశీ నెన్నడు వదిలేదిగాదు. సుశీ నవ్వితే తను నవ్వేది. ఏడిస్తే తను ఏడ్చేది. ఇంట్లో ప్రత్యేకంగా వంటమనిషిని పెట్టి, తన పనులను చాలావరకు తేలిక పరుచుకొని సాధ్యమయినంతకాలం సుశీతోనే గడి పేది రాగిణి.

ఎదురుగా వస్తున్న కారులోనున్న స్నేహితుడు శేఖర్‌కు విష్ చేశాడు చిరునవ్వుతో. కాని శేఖర్ దానికి సమాధానం యివ్వగలిగింది ఆ కారు అర్థ ఫర్లాంగు దూరం వెళ్ళిన తరువాత...

ఒకరోజు రాగిణిని తను ఎంతగా అరిచాడు? చేసింది చాలా చిన్నతప్పు...తను ఆఫీసునుండి వచ్చే టప్పటికి సుశీ ఏడుస్తున్నాడు...ఆరోజు తను పంతం పట్టి రాగిణి కళ్ళవెంట నీళ్ళు తెప్పించాడు...సుశీని ఏడిపించినందుకుగాను తనకదే శిక్ష పొమ్మన్నాడు.

శేఖరు తన కనుకొనలనుండి జారే కన్నీటిబొట్లను చిటికెనవ్రేలి గోటితో తీసివేశాడు.

"తనే రాగిణి – రాగిణే సుశీ – సుశే తను!" అనుకున్నాడు.

కారు పోర్టికోలో వచ్చి ఆగింది. కోటు బుజాన వేసుకొని, డోరు మూసి లోపలికి నడిచాడు.

"రాగిణి రేగిన జుట్టుతో, మాసిన బట్టతో, సోఫాలో మూలకు ఒదిగి కూర్చుంది...టాయిలెట్ కాలేదు!

♦ ♦ ♦

"రాగిణీ!" అన్నాడు సోఫాలో కూర్చుంటూ, "నీవెంత దుఃఖించినా నీ సుశీ యిక నీకు రాడు. తెరమరుగయిన వాడికోసరం నీవెందుకలా కృంగి కృశించిపోతావు..."

రాగిణి ఏహ్యంగా చూచింది ఆ మాటకు సమా ధానంగా..."మీ మొగవారెంత నీచులు!" అన్నం తగా బాధపడ్డది.

అక్కడ ఒక్కక్షణం ఉండలేకపోయాడు... గదిలో మంచంమీద జేరి "ఎందుకు తనలా అన్నాను?" అని ఏడ్చాడు...రాగిణి ఎన్నడూ ఆలా ఏడ్చివుండదు.

సుశీ బల్లమీద ఫొటోలో ఎక్కిరిస్తున్నట్లుగా నవ్వుతున్నాడు!

♦ ♦ ♦

సాయంత్రం ఐదున్నరకు మామూలుగా డాక్టరు రఘు డ్యూటీలోకి వచ్చాడు. శేఖర్‌ను చూచేటప్పటికి అతడి హృదయం బాధపడింది... శేఖర్ మునుపటి శేఖర్‌లా లేడు!

మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చి శేఖర్ భుజంమీద చేయివేశాడు.

"డాక్టర్ శేఖర్!" చాలా బాధగా పలికాడు. బాహ్యంగా అంతకంటె తన బాధను వ్యక్తంచేయ లేడు.

"..."తలెత్తి రఘు ముఖంలోకి చూచాడు శేఖర్. "ఇక వెళ్తాను" అన్నట్లుగా లేచి నిల బడ్డాడు.

"డాక్టర్. కూర్చో!" అన్నాడు రఘు. "డాక్టర్ ఒక విషయం చెబుతాను...నీలోగల శక్తి నాలోగూడ లేదు...ఆ కష్టం అనుభవించిన వ్యక్తులు చెప్పినట్లుగానే నేను చెబుతున్నాను" రఘు ప్రక్క నున్న కుర్చీలో కూర్చున్నాడు.

"సిగరెట్ తీసుకో!" అన్నాడు సిగరెట్ కేసు ముందుపెడుతూ - తనొకటి తీసుకొని లైటర్ వెలి గించి సిగరెట్టు వెలిగించుకున్నాడు. శేఖర్ ముఖం

లోకి చూచాడు. అతడు 'ఒద్దు' అని తల వూపాడు.

"ఒక డాక్టర్‌గా నీవే నీబాధను మర్చిపోవాలి!"

రఘు లేచి కిటికీ ప్రక్కగా నిలబడి పొగను బయటకు వదులుతున్నాడు.

"అది అసంభవమనుకుంటాను..."

"అది నీవు డాక్టరుగా అలవాటు చేసుకోవాలి!"

"విఫలుణ్ణయ్యాను" శేఖర్ లేచాడు. "సారీ డాక్టర్...వస్తాను. మర్చిపోయ్యాను చెప్పటం... ఒక నెలరోజులు శెలవ పెడదామనుకుంటున్నాను."

"కూర్చో డాక్టర్..." శేఖర్ దగ్గరగా వచ్చాడు రఘు. రెండు చేతులు బుజంమీద వేశాడు. ముఖంలో ముఖంపెట్టి కళ్ళల్లో కళ్ళుపెట్టి చూచాడు. "శేఖర్ ...కూర్చో!" అన్నాడు. "సిద్ధాంతరీత్యా పోయిన వస్తువు చోటులో అలాంటి వస్తువునే మరొకదాన్ని తెస్తే చాలావరకు దాని స్వంతదారుడు, లేక ఆత్మీయుడనబడేవాడు ఆత్మసంతుష్టి పొందగలుగుతాడనుకుంటాను..."

"అదెలా సాధ్యం...నా బాధ అలాంటి పదార్థాన్ని గురించి కాదుగా!"

"శేఖర్! కాని...మీరు మరోలాగ అనుకోకపోతే నేనొక విషయం చెబుతాను" రఘు తాపీగా కూర్చున్నాడు.

"చెప్పండి ..దానికేం!"

"మనస్సులో బాధపడగూడదు ... నన్ను మాత్రం అపార్థం చేసుకోవద్దు. అలా అని మాట యివ్వండి!" అని చేయిజాపాడు.

"రఘు! అలాగేబాస చేస్తున్నాను. ఇకముందు గూడ నీ మీద పూర్వపు భావమేవుంటుంది..." తల వంచుకున్నాడు.

"ఒక్క నిమిషం రఘు సంకోచించాడు..." మీరు అలాంటి మరోపిల్లవాడికే తండ్రి ఎందుకు కాగూడదు. ...మీ మనసుకి నచ్చిన మరొకడిని "సుశీ!" అని ఎందుకు పిలవగూడదు?... తన తలమీదనుండి పదు బరువు తగ్గినట్లుగా తేలికపడ్డాడు.

"అదెలాసాధ్యం?" విచిత్రం అతడి మొఖంలోకి చూచాడు. ఒక శాంతిలేని చిరునవ్వునవ్వాడు.

రఘు తడబడ్డాడు. చిన్నగాగొణిగాడు. "అనాధ శరణాలయంనుండి ఒకపిల్లవాడిని తెచ్చుకోగూడదా?" శేఖర్ మొఖంలోకి చూచాడు.

శేఖర్‌లో ఏలాంటి మార్పు లేకపోవటంతో రఘు హృదయంగూడ ఏలాంటి మార్పుచెందలేకపోయింది.

"డాక్టర్ శేఖర్ ... ఆలోచించుకో!"
"దాని వలన లాభంవుంటుందంటరా?"

"దానికిసమాధానం నేను చెప్పటమనేది భావ్యంగావుండదు ... నీ మిసెస్‌తో చర్చించు ... ఏ మాత్రమైనా ఫలితముంటుందనుకుంటేనే ప్రయత్నించు–నేను చేయగలిగిన సహాయమంతా చేస్తాను."

శేఖర్ లేచాడు ఇంటికి వెళ్ళటానికి. రఘు అడ్డు చెప్పలేదు.

రాత్రి రఘు చెప్పిన విషయంమీద తర్జనం ఆలోచించాడు. ఒక నిశ్చయానికి రావటంకోసరమై ... రాగిణితో ఇప్పుడు చర్చించి విఫలమయ్యేదానికంటె పిల్లవాడిని తీసుకువచ్చి ఒప్పించటమనేది తేలికగా ఉంటుందనుకున్నాడు ... అలాగే నిశ్చయించుకున్నాడు! రాత్రి పన్నెండుగంటలకు నిద్రపట్టింది...

◆ ◆ ◆

"రాగిణీ! ..." అన్నాడు చాలా చిన్నగా. "టాయిలెట్ అవ్వు ... పనుంది వెళ్దాం."

రాగిణి మాట్లాడలేదు ... లేత్తలేదు.

"రాగిణీ!" అన్నాడు తిరిగి చిన్నగా "తొందరగా వెళ్లాలి ... త్వరగాకానీయ్!

ఎక్కడికన్నట్లుగా చాలా నీరసంగా చూచింది.

శేఖర్ ముందుగా "ఊహించినభావాలే మసక మసకగాకదుల్తున్నాయి ఆమెలో. "సుశీ కోసం!" అందామనుకున్నాడు. ఆ మాట అనివుంటే తను అక్కడ నిలబడివుండలేదు ... రాగిణి హృదయం ప్రశ్నలయ్యేలా ఏడుస్తుంది ... మరణించిన సుశీ ఎన్నడూ తిరిగిరాలేదని రాగిణికి బాగాతెలుసు!

"నేను రాకుంటే పని ఆగిపోతుందా?" చాలా సహజంగా అడిగింది. తను ఇలాంటి ఎదురు ప్రశ్న ఎన్నడూ శేఖర్‌ని అడిగివుండలేదు.

"కాదని నేనను ... నాకేమాత్రం ఆత్మ సంతుష్టి వుండదు, ... కానీ, రాగిణి ... ప్లీజ్ ... ప్రతి

చూస్తున్నాను ... నీవు 'కాదు' అనకూడదు." అన్నాడు ముఖానికి ముఖం దగ్గరిగా పెట్టి.

రాగిణి ముఖం ప్రక్కకు తిప్పుకుంది.

"ఇలాగే వస్తాను !"

"కాదు .. "

వడివడిగా బాత్ రూమ్ లోకి నడిచింది మారు మాట్లాడకుండా.

సరిగ్గా రాగిణి, శేఖర్ కారు దిగేటప్పటికి రఘు ఎదురొచ్చి "నమస్తే రాగిణీదేవి!" అన్నాడు.

"నమస్తే!" అంది. తలవంచుకుంది.

"క్లబ్బుకు రావట మేమా నేకారు!"

రాగిణి ఏం మాట్లాడలేదు.

ముగ్గురు స్ప్రింగ్ డోర్ తెరుచుకొని లోపలికెళ్ళేటప్పటికి చిరునవ్వుతో బాలల శరణాలయం సెక్రటరీ ఆహ్వానించి కుర్చీలు చూపించింది.

"వీరు శ్రీమతి రేణుకాకుమార్ ... దీనికి సెక్రటరీ!" అన్నాడు రఘు పరిచయం చేసే దృష్టితో.

"నమస్తే!" అన్నారు శేఖర్ దంపతులు.

"అంటే ... ఏమిటిది ?" అంది రాగిణి "దేనికి సెక్రటరీ వీరు ?"

రేణుకాదేవి తలవంచుకుంది చిరాగ్గా

"అదే బాలశరణాలయానికి!" అన్నాడు రఘు

రాగిణి హృదయంలో అనుమానం అస్పష్టంగా కదిలింది. ఇప్పుడు వాళ్ళెందుకిక్కడికి వచ్చినట్లు! అనుకుంది.

"రఘు!" అన్నాడు. శేఖర్. "ఇక్కడనుండి త్వరగా వెళ్ళటమే నేది మంచిదనుకుంటాను!" అస్పష్టంగా గొణిగాడు.

"రేణుకాదేవి ... ఆలస్యం ఏమీ లేదనుకుంటాను ?" అన్నాడు. భావగర్భంగా రాగిణికి అసలు విషయం తెలియదని రఘుకుగూడ తెలుసు.

రఘు, శేఖర్ లిద్దరు ఎవరికి వారు ముందు ఏమి జరుగుతుందా అని ఆదుర్దాతో కుర్చీలో ముందుకు జరిగి కూర్చున్నారు.

ఇంతలోకి ముగ్గురు పిల్లల నెత్తుకున్న ఆడవాళ్ళు ఆ గదిలోకి వచ్చారు.

"రాగిణీ!" అన్నాడు శేఖర్ చాలా బాధగా. "మన సుఖ ఎవరో ఎన్నుకో!"

రాగిణికి తల తిరిగినంత పనయింది. అనుకోని సంఘటనకు ఆమెలో తుఫాను రేగింది. కోపం కట్టలు తెంచుకు ప్రవహించింది. క్రింది పెదిమను నెత్తురు కారేలా పంటితో నొక్కుకుంది. ముఖాన చేతులు కప్పుకొని వలవల ఏడ్చింది... ఉన్మత్తుగా కుర్చీనుండి లేచింది.

"శేఖర్!" అంటూ బయటకు పరుగెత్తింది.

కారులో కూర్చొని డోరు మూసిన చప్పుడు లోపల కూర్చున్నవారికి వినబడింది.

ఊహించని సంఘటన జరిగినప్పుడు ఎంత నిశ్శబ్ద మావరిస్తుందో అలాగేవుంది ఆ గది కూడ.

"రఘూ!.." అన్నాడు శేఖర్.

"రేణుకాదేవి!" అన్నాడు రఘు. "ఆ క్షమించాలి... ఆమె ప్రవర్తనకు మీరేమీ బాధపడరను కుంటాను!"

సమాధానంగా రేణుకాదేవి నవ్వింది — ఎంతో అనుభవమున్న దానిలా !

ఆ ముగ్గురిలోకి ముచ్చటగా ఉన్న అబ్బాయిని ఎత్తుకొని ముద్దు పెట్టుకున్నాడు శేఖర్! "ధాంక్యూ రేణుకాదేవి!"

"వస్తా రేణుకాదేవి" రఘు గూడా లేచాడు.

సెక్రటరీని వదిలి చాలా దూరం వచ్చిన శేఖర్ భుజంమీద చేయివేసి రఘు అన్నాడు. "ప్రయత్నించు శేఖర్! ఫలితం శూన్యమైతే తిరిగి తీసుకు వచ్చేద్దాం!" పోర్టికోలో ఉన్న తన కారులో కూర్చొని వెళ్ళిపోయాడు.

శేఖర్ భయం భయంగా పిల్లవాడిని తీసుకువచ్చి "తలుపు తీయి రాగిణీ!" అన్నాడు.

ఆమె ఏడుపు పెద్దదయింది. అతడివేపు చూచిన రాగిణి చూపు భయంకరంగా వున్నది.

ఇక లాభంలేదనుకున్నాడు శేఖర్. తనే ఒక చేత్తో పిల్లవాడి నెత్తుకొని తలుపు తెరిచాడు. రాగిణి ఒక మూలకు జరిగింది. ఆమెకివతల ప్రక్కగా పిల్ల వాడిని పడుకో బెట్టాడు.

రాగిణి ఏడుపు ఏమాత్రం తగ్గలేదు.

పిల్లవాడు నోట్లో వేలేసుకొని చీకుతూ నవ్వుతున్నాడు!

కారులో పోతూ "రాగిణీ!" అన్నాడు ఉండబట్టలేక. తిరిగి ఏమీ సమాధానం రాకపోయేటప్పటికి మెదలకుండా ఊరుకున్నాడు.

జరగబోయే సంగతులేవీ ఊహించటమనేది ఆ సమయంలో కష్టంగాదు కాబట్టి అంతగా బాధపడలేదు - తనకు తెలుసు రాగిణి బాధ!

"రాగిణీ! నేను చేసినపని నీకు కష్టం కలిగిస్తే—" అన్నాడు. "క్షమించు!" గొణిగాడు.

రాగిణి దానికి ఏమీ సమాధానం చెప్పలేదు. చిన్నగా ఆలోచించ సాగించి శేఖర్ చెప్పింది సమంజసమో కాదోనని — ఏది ఏమైనా శేఖర్ చాలా తొందరపడ్డాడు — అదే అనేసింది!

"మీరు చాలా తొందరపడ్డారు!"

"అవ్వచ్చు రాగిణీ! మన బాధను మర్చిపోటానికి ఇదొక్కటే సాధనమనిపించింది!" జవాబిచ్చాడు శేఖర్.

రాగిణి చీర చెరుగుతో ఒకసారి మొఖం తుడుచుకుంది.

పిల్లవాడు కారు అదురుడికి ఏడ్వటం మొదలుపెట్టాడు.

రాగిణి ఇప్పుడు ఇరకాటంలో పడింది. ఒకసారి పిల్లవాడిరంక చూచింది. తిరిగి మొఖం త్రిప్పుకొని వలవలా ఏడ్చింది.

"కారు ఆపమంటావా?" అడిగాడు శేఖర్. పరిసరప్రాంతం చూడముచ్చటగా వుంది. ఒకవైపు అందమైన తోటలు. మరియొకవైపు నిశ్శబ్దంగా పయనిస్తున్న నదీజలాలు. ప్రకృతైనా రాగిణి మనస్సుకు ఊరట కలిగిస్తుందేమోనని అతడి ఆశ!

"వద్దు పోనీయండి!" అంది. ఆమె హృదయాన్ని సమాధానపరుచుకోబోయింది.

గాలికెగురుతున్న చీర చెంగును తలమీదగా కప్పుకుంది. చారలుకట్టిన చెంపల్లో, వెలుగులేని నేత్రాల్లో, వినోదం ఎండిన వదనంలో సూక్ష్మాతిసూక్ష్మంగా ఏదో వెలుగు వెలిగింది. వణుకుతున్న చేతులతో పిల్లవాడి నెత్తుకుంది. ముద్దు పెట్టుకుంది.

"తను గతించిన సుశీని, బాధలని మరవాలి!" మనస్సును గుప్పిటలోకి తెచ్చుకొని అనుకుంది.

శేఖర్ తన ముందున్న అద్దంలో ఇదంతా చూచాడు. ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయ్యాడు.

"రాగిణీ! మన సుశీలా లేదు!" అన్నాడు.

"అంతే! వలవలా ఏడ్చింది. కన్నీటితో మొఖమంతా తడిసిపోయింది.

శేఖర్ గతుక్కుమన్నాడు. - చాలా బాధపడ్డాడు. "పోనీలే, శశీ అని పిలుద్దామా?" అన్నాడు అనునయిస్తూ.

పిల్లవాడు ఆమె చేతులలో హుషారుగా నవ్వుతున్నాడు తన చిన్నారి చేతులతో రాగిణి చెంపల మీద అడుతున్నాడు - అది ఆమెకు తన కన్నీరు తడుస్తున్నట్లుగా వున్నది.

"శశీ!" అంది. బుగ్గలు కందిపోయేలా ముద్దుల వర్షం కురిపించింది.

స్త్రీ ఏలాంటి అనుభూతిని దాచుకోలేదు!

# నందనందనా!

శ్రీ కన్నకంటి ప్రభాకరశాస్త్రి



ఒక్కతె నున్నదాన! నిట ఓపగలేనని తెలిపోయె - నీ
చక్కనిమోము నొక్కతరి సంతసమందుచు ముద్దుగొందు - నా
ప్రక్కనజేరి హాయిమెయి పానముచేయుచు కౌగలించి - నా
చిక్కని నీలిముంగురల శీర్షము వాసనచూడు మాధవా !

హాయిగ నిన్నుజేరి పరిహాసములాడుచు ఇస్కతిన్నెలన్
చేయినిచేయి పట్టుకొని - చిందులు త్రొక్కుచు పాట పాడుచున్
పోయిననాటి రాత్రి మనిపోయిన సార్థకమందు జన్మ - నా
హాయిలు సోయగాలను బహా! గొనుమో ఇక నందనందనా!

చల్లని పిల్లగాడ్పులు విశాలముగా నిట వీచుచుండె - నీ
పిల్లనిగ్రోవిలోన గల పిల్పును వింటిని! నా శరీరమే
ఝల్లని పుల్కరింప ఇక సాహసమే కనిపింప - ఈ విధిన్
ఉల్లము చేతబట్టుకొని ఊహలు నిండగ వస్తి - మాధవా !

# త్రాగుబోతు

జర్మను మూలం :
హాన్స్ ఫల్లాడా

ఆంధ్రానుసరణ :
డాక్టరు వి. ఎన్. శర్మ



## ఇంతవరకు సాగినకథ

[సోమర్ మధ్యరకపు కుటుంబానికి సంబంధించిన వర్తకుడు. ప్రారంభంలో దానికని దీనికని చేసేఖర్చుల్లో పొదుపుగా వుంటున్నా వ్యాపార సంస్థ పెద్దదవుతూ వుండటంతో డాబూ దర్పానికి తెగఖర్చుచేయటానికి ప్రారంభించాడు. దాంతో త్రాగుడు ఎక్కువై పోయింది. భార్య, మాగ్డా, నయాన భయాన ఎంతో చెప్పిచూసింది. కాని లాభం వుంటేనా? ... నష్టంరావటంతో భార్య సంస్థని నడుపుతూ భర్తని కట్టుదిట్టాల్లో పెడదామని ప్రయత్నించింది. ఇది భర్తకి ససేమిరా గిట్టింది కాదు. భార్యతో తగువులాడి ఇంట్లోనుంచి వెళ్ళిపోయాడు. ఇప్పుడు అతని మకాం పరాయివాళ్ల ఇంట్లో. ఆ ఇంటాయన, లోబెడాన్స్, డబ్బునిగుంజడానికి తతంగంపన్నాడు. చేతిలో డబ్బులేక పోవటం మూలాన సోమర్ ఒక రోజు అర్ధరాత్రి స్వంత ఇంట్లోకి ప్రవేశించి తనకు కావలసిన సొత్తుని పెట్టిలో దాచుకున్నాడు. ఆ సమయాన్నే భార్య అక్కడ ప్రత్యక్షమైంది. ఇక చదవండి]

## I

దొంగలు కాక మరెవ్వళ్లు అలా సాహసంచేస్తూ అర్ధరాత్రివూట ఇంట్లో ప్రవేశిస్తారు? ప్రారంభంలో నేనెవడినో ఆవిడ గుర్తుపట్టలేక పోయింది. అప్పటి నా ఆకారం చూశాక హడలిపోక మరేమయి పోతారు? గడగడ వణికిపోతున్నది. ఆ భయాన్ని పైకి చూపనీయకుండా ఎంతో ప్రయత్నం చేస్తూవుంది ...

వింత మృగం లోపల ప్రవేశించి అలా గదిని చిందర వందర చేస్తూవున్నందుకు ఆశ్చర్యపడుతూ నా కేసి కొంత సేపుచూసింది. క్రిందవున్న పెట్టిని చూసింది. చేతిలోవున్న వెండి సామానుచూసింది. క్రింద పడ్డ వస్తువుచూసింది.. దీనంగా చూస్తూ "ఏమండీ! ఎంత మారిపోయారు! ఎంత మారి పోయారు! ఇంతకాలం ఎక్కడ వున్నారు? అలా మీరు వెళ్ళిపోయాక ఎంత భయపడ్డాను? ఎంత భయపడ్డాను! అయిందేమో అయిపోయింది. మీరు తిరిగివచ్చారు. అదేగా మనం ఈ జన్మలో వాంఛించాలిసింది? ఇక్కడే వుండిపోండి. శతవిధాల మీకు చేదోడు వాదోడుగా వుండటానికే ప్రయత్నిస్తాను. మీరు దుడుకు మనుషులని తెలుసు. అప్పటి సంఘటన చూశాక ఒళ్లు మండిపోయింది. అనరాని మాటలు అని మిమ్మల్ని ఎంతో నొప్పించాను ... ... ఇక అలా చేయను. తప్పను మన్నించండి. ...... "అని ఏమేమో అంటున్నది.

నా భార్య సంగతి నాకు బాగా తెలుసుగా! ఇలాటి వుపన్యాసాలని ఇయ్యటానికి ప్రారంభించిందా ఇక ఇతర్లని మాట్లాడనిస్తుందా? అలా మాట్లాడుతూవున్నా మధ్యమధ్య వూపిరి పీల్చుకోటానికి వుక్కిరి బిక్కిరైపోతూవుంది. దానిని పైకి

తెలుపకుండా వుండటానికి ఎన్నోవిధాల ప్రయత్నం చేయటం అవగాహనచేసుకోటం అంత కష్టమైన పనికూడా కాదు.

నాకు తెలిసినప్పటినుంచి మా జీవితంలో మాగ్దాదే పైచెయ్యి. ఆవిడ ఇచ్చే సలహాలు నాకు ఇష్టములేక పోయినా మాగ్దాని తృప్తి పరచటానికి ఇంత కాలం తల ఒగ్గాలసి వచ్చింది. అప్పుడు మాగ్దా ఆడని నాటకాన్ని ఎలా మరచి పోగలుగుతాను? నలుగురి ముందర, ముఖ్యంగా నా ఆదుపాజ్ఞల్లో పనిచేస్తున్న వాళ్ళ ముందర, అలా నోరు చేసుకుని నన్ను అవమానంచేసింది. మాగ్దా అప్పుడు అంత మండిపడి పోవడానికి తప్పునాదే. కాని .. కాని ... ఇంట్లో కీచులాట అయితే మరచి పోవచ్చు. పరాయి వాళ్ళ ముందర అంత రభసచేశాక ఆ అవమానాన్ని ఎలా భరించగలుగుతాను? ... ఇప్పుడే ఆవిడ మాటలకి తల ఒగ్గానా ఇంకేం వుంది? ...... మా ఆస్తిపాస్తులకి నా భార్య సర్వాధికారాలని చెలాయిస్తుంది. తను గీసిన గీటుని దాటకూడదని ఎంతెంత రాద్ధాంతం చేస్తుందో! ఆ సంగతి వూహిస్తూవుంటే ఒళ్లు మండి పోక వరేమవుతుంది? ...

అక్కడ ఇక నిమిషమైన వుండకూడదని నిశ్చయించుకుని ఒక అడుగుముందుకు వేయబోయాను. చేతిలో వెండిచంచాలు వున్నాయి. వాటిలో ఒకటి క్రిందపడిపోయింది. దాన్ని మాగ్దాచూసిందో లేదో గబగబ అటు కేసి వచ్చింది. ఆవిడవుద్దేశం దానిని తీసుకోవాలని. అది నా సామాను! మాగ్దాని తాకనిస్తానా?... ...

మాగ్దాది మొండిపట్టు! గబగబ చంచాని తీసుకోటంచూశాక మాగ్దాకేసి కోపంతో చూస్తూ ఆవిడ చేతిలో వున్న వస్తువుని అమాంతంగా లాగుకున్నాను... ...

దాంతో మాగ్దా గావుకేకలు వేస్తూవుండటం చూశాక ఇక వోపిక అనేది ఎలాగు వుంటుంది చెప్పండి? ఆవిడకన్నా ఇలాటి విషయాల్లో ఒక ఆకు ఎక్కువ చదివిన వాడ్నే అని ఆవిడకి స్పష్టంగా తెలపటానికి నేను గొంతుచేసుకున్నాను.

“నువ్వు నన్ను ఇక్కడవుండి పొమ్మని ఎందుకు అంటున్నావో నాకు తెలియదనుకున్నావా? మత్తులోవున్నానని నీకు తెలుసు. ఇక నువ్వుచెయ్యబోయేది ఈ రాత్రికి ఇక్కడే పడుకోమంటావు? పడుకున్నానా ఆ డాక్టర్లకి కబురంపుతావు. వాళ్లు ఎలాటి కాలాంతకులో హోటల్లో చూశాను. కాల్లో నన్ను వాళ్ళు ఆస్పత్రికి తీసుకొనివెడుతూ వున్నప్పుడూ కళ్ళార చూశాను... వాళ్లు చేయబోయేది త్రాగుబోతులని కట్టుదిట్టాలతో నుంచటానికి కట్టించిన జైల్లోకి తెల్లవారటానికి ముందే చేర్చి ఆనందిస్తారు! దాంతో ఇక నీకు అడ్డువచ్చేవాళ్ళు ఎవళ్లు వుంటారు? నా ఆస్తిపాస్తులని నువ్వే గుటకాయిస్వాహా చేస్తావు... అవునా? కాదా?” అని అంటూ ఆవిడకేసి ఎగాదిగా చూడటానికి మొదలెట్టాను. దాంతో మాగ్దా వణకిపోతూవుంది. దీనవదనంతో నాకేసి చూస్తూ తడబడుతూ “ఎందుకిలా అపార్థం చేసుకుంటూ అంత కంగారుపడటం? అప్పుడు డాక్టర్లని మీ దగ్గరకు పంపింది మిమ్మల్ని జైలుకి పంపటానికి కాదు. ఆ పాడు అలవాటుని మాన్పించటానికి తరుణోపాయం చూపమని వాళ్ళని ప్రాధేయపడ్డాను. నా కోరకను మన్నించటానికి వాళ్ళు అక్కడికి వచ్చారు. వాళ్ళమాట వినివుంటే ఇలాటి దౌర్భాగ్య స్థితిలోకి మీరు దిగిపోయి వుండేవాళ్ళు కాదు....” అని ఏమేమో చెప్పకొని పోతూవుంది.

ఇదంతా నాటకం! బ్రహ్మాండమైన నాటకం ఆడుతూవుంది మాగ్దా నా ముందర! ఈ అర్ధరాత్రి పూట!...

మాగ్దా మాటకి అడ్డువస్తూ “ఈ నాటకాన్ని ఇప్పుడైనా కట్టిపెయ్యకపోయావా?... వూ! నేను త్రాగుబోతుని. అక్షరాలా త్రాగుబోతుని. గావు కేకలు వేస్తూ అందరితో చెప్పకో!... దీనికంతా భయపడుతాననేగా నువ్వు అనుకుంటూ వుండేది! నువ్వు రాక్షసివి! బ్రహ్మరాక్షసివి. నీలాటివాళ్ళకి నీతినియమాలు అనేవి వుంటాయా? నువ్వు వేసిన ప్లాను నన్ను త్రాగుబోతుల జైలుకు చేర్చాలని. దానికి కావలసిన తతంగం అంతా తూ.చ. తప్పకుండా చేస్తూ వున్నావన్న సంగతి అప్పుడే తెలిసిపోయింది. ఆ పప్పులు ఇక వుడకవు!” అని ముందుకు నడవబోతూ ఒక క్షణం మాగ్దాని వూదలగొడుతూ “ఇవ్వాళ నువ్వు చేసిన అవమానాన్ని మరచిపోతాననుకున్నావా?... రేపు తిరిగివస్తాను. అర్ధరాత్రి పూటనే ఇక్కడ ప్రత్యక్షమవుతాను. ఇవ్వాళకిమల్లె అవకతవక మాటలు అన్నావా?... ఇప్పుడు నా దోవన నన్ను పోనియ్యక పోతివా ఆ పని ఇప్పుడే చేసిపోతాను... జాగ్రత్త!” అని అరిచాను.

ఈ క్షణానికి ఇంట్లో పనిమనిషి కూడా మా ముందర ప్రత్యక్షమైంది. పనిమనిషి రావటంతో మార్గాకి ఎక్కడలేని ధైర్యం వచ్చింది. "ఇదిగో ఇప్పుడే డాక్టర్ మాన్స్‌ఫీల్డుకి టెలిఫోను చెయ్యి. పోలీసు ఠాణాకి కబురుచేయటం మరచిపోవద్దు. ఈ లోపుగ ఈయన విషయం నేనే చూసుకుంటానులే" అని పురమాయించటం చూశాక ఇక అక్కడ వుండి పోవటం ఎంత ప్రమాదమో తెలుసుకున్నాను.

పెట్టెలో నేను సామానునంతా సర్దటం మార్గా చూస్తూనేవుంది. ఆ పని చకచక పూర్తిచేసుకోటంతో దానిని ఎత్తుకుని గబగబ బయటికి నడవటం చూస్తూ "యిదంతా నా సామాను. ఒక్క అడుగు బయటికి వేశావా..." అని అరుస్తూ నన్ను అటకా యించబోయింది. ఆవిడ అలా కలుగచేసుకోటానికి నేను ఇష్టపడుతానా? అటకాయించబోతున్న మార్గాని గట్టిగా వెనుకకి నెట్టాను...

టెలిఫోను చేస్తున్న పనిమనిషి ఈ నాటకా న్నంతా చూస్తూ హడలిపోతూ "వూ! వూ! ఆయనే చెయ్యి చేసుకున్నాడు... భార్యనే హత్య చేయబోతున్నాడు..." అని అంటూన్నది.

నేను పుచ్చుకున్న పెట్టెని అక్కడేవుంచి వెళ్ళ మని మార్గా నన్ను గదమాయిస్తున్నది. బలముకొద్ది దాన్ని లాగాలని శతవిధాలా ప్రయత్నంచేసింది. కాని మార్గా ఆటలు సాగనిస్తానా? ఒక్కత్రోపు తోశాను. దాంతో వణికిపోతూ క్రిందపడిపోయింది. ఇదే మంచి సమయమనుకుంటూ గబగబ బయటికి వచ్చేశాను...

## II

"ఏమండోయి ఆ పెట్టెని నా చేతికియ్యండి" మెల్లగా నాకేసి వస్తూ అంటున్న కంఠం వినబడింది. అది ఎవరిదో నాకు తెలుసు. అది మా లోబెడాన్స్ కంఠం. ఇంతకాలం తన ఇంట్లో తల దాచుకోటానికి నాకు ఆశ్రయమిచ్చిన మా లోబెడాన్స్ ఇలాటి సమయంలో మా ఇంటిముందర ప్రత్యక్షమవటం చూశాక విస్తుపోయాను....

"లోపల జరుగుతూవున్న నాటకాన్ని వింటూనే వున్నాను. ఇది స్త్రీలతో సంబంధించిన విషయం, మనం గబగబ వెళ్ళిపోవటం మంచిది. ఆ పెట్టెని ఇలా ఇయ్యండి. నేను ముందు నడుస్తూ వుంటాను..." అని అంటూ పెట్టెని నా దగ్గరనుంచి తీసుకొని పరుగెత్తి పోతూవున్నాడు. కొంచెం ఆగ మని ఎంత బ్రతిమాలుకున్నా అతనిది ఆగే ఘట మైతేగా!

అప్పటికి ఇంకా చీకటిగా వుంది. మా ఇంటి పరి సరాలని వదలిపెట్టి వూళ్ళోకి వచ్చాము. రాజ బాటని నడుస్తూవుంటే ప్రమాదమనుకుంటూ సందు గొందులని వెదుకుతూ నడుస్తూ వున్నాము.

"ఏమండోయి! వాళ్ళంతా ఎందుకలా అరుస్తూ వున్నారు? వాళ్ళమీద మీరేం చెయ్యి చేసుకోలేదు కదూ?" అని లోబెడాన్స్ నన్ను అడిగాడు దోవలో ఒక నిమిషం ఆగిపోతూ.

"అంతవరకు జరగలేదులే! వాళ్ళని కొంచెం భయపెట్టాలసిన అవసరం వచ్చింది...అంతే! దానికే అలా గావుకేకలు వేయటం!" లోబెడాన్స్‌ని సమాధానపరచటానికి అన్నాను.

"అంతేనా! అలా అయితే ఫరవాలేదు. ఇంతకూ మీకు కావలసిన సామాను గట్రా తెచ్చు కున్నారన్న మాటేగా!..." అని అంటూ పెట్టె తెరిచాడు. పైన వెండిసామాను వుండటం చూస్తూ దాన్నంతా తడుముతూ "చూడటానికి బాగానే వుంది...వెలకి చూపితే మీరు అనుకున్నంత మొత్తం రావటం మాత్రం కష్టం..." గొణగటానికి మొద లెట్టాడు.

"ఆ విషయంలో నువ్వేం కంగారుపడనక్కర లేదులే! నా వస్తువుల సంగతి నాకు బాగా తెలుసు..." అని అతన్ని సమాధానపరుస్తూ అన్నాను.

లోబెడాన్స్ వాలకం చూస్తుంటే ఈ సామాను నంతా గుటకాయస్వాహా చేయాలని తంత్రం పన్ను తున్నట్లు అవగాహన చేసుకోటం సులభం. అప్పటికే అలసిపోయి వున్నాను. అతను సమయానికి ప్రత్య క్షమై పెట్టెని ఇంతదూరం తీసుకునివస్తూ సహాయ పడటం మంచిదయింది. లేకపోతే చక్రం ఎలా అడ్డు తిరిగిపోయేదో ఎవళ్ళకి తెలుసు?...అంచేత ఇలాటి సమయంలో అతనితో జాగ్రత్తగా మెలగుతూ వుండటం అన్నివిధాలా మంచిదనుకున్నాను....

ఇలా నడిచి నడిచి మా బసకు చేరుకున్నాం. లోబెడాన్స్ తలుపు తెరిచాడు. తిన్నగా నా గది లోకి ప్రవేశించాను. నాకేసి మందహాసం చేస్తూ చూస్తూ లాగుజేబులో తను దాచివుంచుకున్న సీసాని

పెడుతూ "ఇదిగోనండి ! ఇవ్వాళ మీరు చాలా కష్టపడ్డారు. దీనిని పుచ్చుకుంటేరా ఆ గొడవనంతా మరచిపోవచ్చు..." అని చూపాడు.

ఈ సమయంలో నాకు కావలసిన మందు అదేగా!" దానిని పుచ్చుకుంటూ "దీనికి ఎంత ఖర్చు పెట్టావు ?" అని అడిగాను.

"రెండున్నర మార్కులు" అని వినయంతో అన్నాడు.

"అంతేగా !" అని అంటూ జేబులో నుంచి నోటుని తీసి అతని కిచ్చాను. "ఇక నువ్వు వెళ్ళిపోవచ్చు. తెల్లవారాక అన్ని సంగతులు మాట్లాడుకుందాం" అని అతన్ని పంపివేసి మంచంమీద పడుకున్నాను. నిద్రరాదు. దాహం! ఎంత పుచ్చుకున్నా ఈ దాహం తీరేటట్లు కనబడటంలేదు. దాంతో అప్పటి దృశ్యం కళ్ళకు కట్టినట్లు కనబడుతూ కూదలగొట్టి వేస్తూవుంది. ఇలాటి సమయంలో ఇక నిద్రాదేవతకి స్వస్తిచెప్పి ముందు చేయాలసిన పనిపాటలని గురించి ఆలోచించటానికి ప్రారంభించాను....

నా అవసరాలకి కావాలసిన సామాన్లతో పెట్టెని బాగా నింపాను. రెండు మూడు నెలలు ఏదో విధంగా వాటిని కాలక్షేపం చేసుకోవచ్చు. తరువాత ?...ఆ గొడవ ఇప్పుడెందుకు చెప్పు ? ఇప్పుడు ఈ మనిషినుంచి తప్పుకోటం అన్నివిధాలా మంచిది. లోబెడాన్స దృష్టి అంతా ఈ పెట్టిమీదే ! దాంతో ఇంట్లోనుంచి కదలనిస్తాడా ?...

కాలోచిత కృత్యాలను ముగించుకున్నాను. ఆ సంగతి అతను బాగా పసికట్టాడు. తలుపు తెరచానో లేదో లోబెడాన్స గది ముందర ప్రత్యక్షం! తను తెచ్చిన కాఫీ సామాన్లని బల్లమీద వుంచాడు. వాటికేసి చూస్తూ "దీనితో తృప్తిపడతా ననుకున్నావా ? రెండు సీసాలు పట్టుకుని రావాలి. అయిదు నిముషాల్లో రావాలి" అని పురమాయిస్తూ నోటుని అతని చేతిలో వుంచాను.

"కొంచెం ఓపిక పట్టాలండి. అంగళ్లు తెరవటానికి ఇంకా వ్యవధి వుంది" అని గొణుక్కుంటూ అన్నాడు.

"ఆ గొడవ నా కెందుకు ? నాకు ఇప్పుడే కావాలి...అంగళ్లు తెరవకపోతే వాళ్ళ ఇండ్లకి వెళ్ళి తీసికుని రావాలి..." అని లోబెడాన్సని బయటికి పంపాను.

లోబెడాన్స ఈ పని చూసుకోటానికి వెళ్ళిపోయాడు. దుకాణాలు దగ్గరలోలేవు. అతను తిరిగి రావటానికి అధమము అర్ధగంట అయినా అవుతుంది. ఈలోపున్నే నా పని నేను చకచక చేసుకోటం అవసరం,...

అప్పటికి బాగా తెల్లవారింది. నా సామాన్లని పెట్టెలో సర్దుకుని పెట్టెని పుచ్చుకుని ఇంట్లోనుంచి చడీచప్పుడూ లేకుండా బయలుదేరాను. బయట ఎవళ్ళూ లేరు. రెండు మూడు నిమిషాల్లో ఆ పరిసరాలకే ఒక నమస్కారంపెట్టి బయటపడి పారిపోయాను.

---

# స్వీకారం

"రాఘవ"

(గతసంచిక తరువాయి)

నిస్పృహా – నిరాశా పెనవేసుకొన్నాయే గాని, నమ్మకొన్న మురారి నవ్వుతూ కనిపించనే లేదు. ఆ సమయంనుంచీ మురారి మీదవున్న సదభిప్రాయం కాస్తా తారుమారైంది. లెఖ్ఖ కట్టుకోవలసిన ఆత్మీయుల్లో ఒకడు కాదనుకొంది. 'చట్టాలు దొంగలున్న' సామెత నిజంగా ఎవరు చెప్పారోగానీ, మహా బాగా చెప్పారని ఒక విషపునవ్వు నవ్వుకొంది. సావిత్రి హృదయంలో వ్యతిరేకార్థాలు – వ్యంగ్యభావాలు కలగటం మొదలెట్టాయి. ఇక యీ లోకంలో నమ్మటానికి బదులుగా ద్వేషించటం మంచిదనిపించింది. ప్రేమించటం అంత బుద్ధితక్కువ పని సృష్టిలో మరొకటి లేదని ధృవపర్చుకొంది. దయతల్చటంకంటే, క్రోధంతో బ్రతకటం మంచిదనుకొంది. సానుభూతి సన్నగిలిపోయి, ఆ స్థానంలో పగ రగలటం మొదలెట్టింది. ఓర్పు నశించి, ఉద్రేకం హెచ్చుకాసాగింది. మంచి కేవలం చెడుకోసమే ఆమెలో లీనమైపోయింది. ఆనందం పూర్తిగా ఆవేదనై, బాధగామారి, నిలువెల్లా దహించుకొని పోసాగింది. ప్రతి విషయంలోని న్యాయమూ - ప్రతి సంఘటనల్లోని నీతీ – ప్రతి సన్నివేశంలోని నిజాయితీ ఆమెపట్ల పూర్తిగా అన్యాయమై – అరాచకమై – అవినీతియై – మోసమై నర్తన చేయసాగింది. చూపులో అహర్నిశం జ్వలితజ్వాలా శిఖలూ – వేయి నాగుల నాలికల్లాగా కదలాడటం జరుగుతోంది. మాటల్లో నిత్యమూ పాషాణాలు బ్రద్దలవుతున్నాయి. నడకలో - చేష్టలో నాగరికత నశించిపోసాగింది. పెళ్లయిన తర్వాత సావిత్రి ప్రళయ స్వరూపిణి అయింది.

సీతాపతికీ – కాంతమ్మకీ సావిత్రిలో గల్గిన యీ మార్పు యేమీ తెలియదు. 'యింకా మన అమ్మాయి పూర్వంలా మాదిరిగానే వుంది' అని తలుస్తూ వున్నారు. కాని పార్వతి యిట్టే అర్థంచేసుకొని నమ్రతతో, సావిత్రికి, యే కష్టమూ కల్గనీయకుండా చేద్దామని ప్రయత్నించసాగింది? ఎందుకూ? ఎవరు మెచ్చనూ?

పెళ్లికొచ్చిన వారంతా పార్వతిని రకరకాలు విమర్శించి, తలవంచేలాగు చేశారు. 'పరాయి సంబంధం తెచ్చి చేసుకొని ఏం బావుకుందామని పార్వతీ'! అని ముఖంమీదే కొందరడిగారు. 'అయినవాళ్లు యీ కాలంలో యెందుకూ పనికిరారు కాబోలు' అని ఒకామె నెత్తిమీద మొట్టినట్టుగా అడిగింది పార్వతిని. ఏం చేస్తుంది? కళ్లు చెమ్మగిల్లినయి... అంతే.. 'ఇదంతా తల్లీ కొడుకుల పన్నాగం' అన్నాడొకడు. 'కట్నాలు యివ్వకూడదని ప్రభుత్వం చట్టాలు తయారుచేసి అమలులో పెడితే, అసలు సీతాపతి కట్నం యెలా యిచ్చాడో? యెందుకిచ్చాడో? ఆ పెళ్ళికొడుకు B.A. చదువుకొని కూడా, ఎలా తీసుకున్నాడో కనుక్కుంటాను. చట్టానికి వ్యతిరేకంగా సీతాపతి చేసిన పనిని యెలాగైనా సరే కోర్టుకెక్కిస్తాను...చూడు మరి నా తడాఖా'' అని మురారి బంధువొకడు, మీసం మెలివేసి సీతాపతి వంకా, కాంతమ్మ వంకా తీవ్రంగా చూశాడు. తల్లీకొడుకులు యేమీ తెలియనట్టు, తమ విషయం కాదన్నట్లూ నటిస్తూ తలవంచుకొని చెరో ప్రక్కకి వెళ్ళిపోయారు.

కాని కాంతమ్మ మాత్రం సగర్వంగా పదిమందిలో గొప్పగా పెళ్ళిచేశామని ప్రగల్భాలు పల్కసాగింది. పనిలోపని ఔపోసనం కూడా చేసేద్దామని నిశ్చయించి, తల్లిద్వారా సీతాపతి అనుజ్ఞపొంది, అమ్మలక్కలతో పడకగదిని అలంకరింపచేశాడు.

కైకను మార్చిన మంథరకూ – సీతాపతిని మార్చిన కాంతమ్మకూ పోల్చిచూసుకుంటే పెద్ద తేడా యేమీ కనిపించదు. కానీ, పూర్తిగావించిన విషయాలు వేరు. అంతే...మిగతావన్నీ సమానమే.

(90వ–పేజీ చూడుడు)

# అర్ధనారీశ్వరము

బ్రహ్మశ్రీ గుమ్మిడిదల వెంకటసుబ్బారావు





గతరెండు వ్యాసములలో స్త్రీ పురుషులలో "సమత్వాదర్శము" గురించి విపులముగ జదివితిమి. ప్రపంచమంతటిలోను అందు ముఖ్యముగ మనదేశములో అనేక విషయములలో పురుషాధిక్యత, స్త్రీలతక్కువ స్థితి గమనించుచున్నాము. ఇందుకు కొంతవరకు ధర్మశాస్త్రరచన యెక్కుడుగ పురుషుల అధీనమందుండుట కారణమైనను స్త్రీలయందలి "అబలత్వ" భావమే ముఖ్యహేతువని గుర్తించితిమి. కాని ఆధర్మము లెట్టివైనను, యిప్పటి స్త్రీలపరిస్థితి బహుహీనముగనే యున్నదనియు, ఇందనేక మార్పులవసరమనియు జూచితిమి కాని యెన్ని మార్పులు చేసినను స్త్రీ, పురుషప్రకృతులు స్వతఃగ భిన్నములనియు, ఆ యాభిన్నప్రకృతుల సహజస్వభావమునుబట్టి వారి వారి స్వధర్మము లేర్పడవలెననియు, అందు స్త్రీలలోని స్త్రీత్వమును, పురుషులలోని పౌరుషత్వమును అణపజూచుట సహజవిరుద్ధమును, ఫలితములపట్ల నిరర్థకమును అగునని మనము జదివితిమి. మన సంఘములో యిప్పుడవసరమైన ముఖ్యమార్పు యీ స్త్రీపురుషులలో మగవారు యెక్కువ – ఆడువారు తక్కువ అనుభావము మారుట. ఇందుకై పురుషులలోని "అహం"కారము పోవలెను – స్త్రీలలో కొంతవరకు యీ "అహం" భావము తగుపాళ్లలో కలుగవలెను. కాని యిందలి "పరమార్థ" విషయమును బరిశీలించినచో, మొత్తం సంఘములో స్త్రీపురుషులుభయులు ఒకే మూర్తి యందలి భిన్నభాగములు మాత్రమేననియు, ఇందే భాగమునకు లోపముగాని, అపచారముగాని, అవరోధముగాని, న్యూనతగాని, కలిగినను, అసలు మూర్తికే భంగకరముగననియు గ్రహించుటకై మన శాస్త్రములందును, సంప్రదాయమందును గల "అర్ధనారీశ్వరా" ధర్మమే మనకిప్పట్ల పరమలక్ష్యమును, ఆరాధనీయమునను భావనతో, యిందుగూర్చి యీ వ్యాసములో కొంతవరకు చర్చింతము.



సాంబశివుని "అర్ధనారీశ్వరు"డని మనము పిలతుము.

"నమ్మితినా మనంబున సనాతనులైన
ఉమామహేశులన్
మిమ్ము బురాణదంపతుల"

అని శ్రీ రుక్మిణీదేవి ప్రార్థిస్తుంది. "పురాణదంపతు"లనీ "సనాతను"లనీకూడా వారినిస్తుతిస్తుంది. నిజానికి ఒక్క సాంబమూర్తేకాదు – యీ అర్ధనారీశ్వరుడు; సంపూర్ణావతారాలను వర్ణించవలసివస్తే సీతారాములు, రాధాకృష్ణులు, లక్ష్మీనారాయణులు, అట్టి మూర్తులే. మంత్రశాస్త్రంలో యీ "యుగళము"లో ముందుగ దేవతానామమునే స్మరించాలనీ, అట్లా చెయ్యకపోతే కుంభీపాకనరకమే మనకి గతి అనీ చెప్పబడినట్లు లోగడ చదివేము. మానవప్రకృతిలో మన అందరిలోను స్త్రీత్వాంశ యెడమభాగమునందును, పురుషత్వము కుడివైపున ఉంటాయనికూడా ఉదహరించేము. ఈ భావాన్నే మన పంచభూతములు, వాని తన్మాత్రలకు అన్వయించి ఆ మధ్య నేను రచించిన ఒకగీతికను యీ సందర్భములో "గృహలక్ష్మి" పాఠకులకు అందచేయుట నావిధి.

## "నీవు — నేను"

నీవు, నేనని బల్కంగనో లతాంగి।
వలనే! విను! వికసించు పుష్పమందు,
మధ్యమండలమున వెలయుపాడియ
నేను।
వాయువేగంబునను బోయి నాల్గుదిశల।
నింపి, నాయింపు సొంపును యెల్లెడలను
దెల్పి, దుష్టులపోద్రోలి ముక్తిజూపు।

మాధురీఘ్రాణగంధంబు నీవె కావె ?
నీవునేనని వేరుగా బల్కనేల ॥
ఆపములలోని అమృతాపస్సు నేను,
అందుగల రసజ్ఞత వెల్లువలుగ,
మృత్యుమయమైన యీ విశ్వమెల్ల
యెడల।
జేర్చి ప్రవహింపజేసెడి సరసినీవు।
నిత్యజీవివి, సంజీవి, నాదుజీవి,
నీవు, నేనని వేరుగా బల్కనేల ॥
రూపములకెల్ల మన్మథరూపమేను,
నాదుసొంపును, సొగసును, యిలకుజూపి
మానవులనెల్ల మోహబద్ధులను జేసి।
క్రూరహింసాది రక్కసిరూపులకను।
సరససౌందర్యమును జూపురూపవసివి।
లక్ష్మి, సారస్వతుల యేకమూర్తి వీవు।
నీవు, నేనని వేరుగా బల్కనేల ?
వాయువులకెల్ల ప్రభుడగు మాతనేను।
నాదుస్పర్శంపు రెక్కలబుట్టి నట్టి।
మలయమారుత స్పర్శంబునీవకావె ?
నీవు నేనని వేరుగాబల్కనేల ॥
నాదములలోని ప్రణవనాదంబు నేను।
నాదుశబ్దంబు నాల్గు సంద్రాలదాక।
నిండియుండిన బ్రాహ్మణ బృందములకు।
సాంగవేదాంగపదముల క్రమముతోడ।
సరససూక్తుల స్మృతులను దెలియజెప్పు।
ముక్తికాంతవు సావిత్రివీవకావె?
నీవునేనని వేరుగాబల్కనేల ॥
నీవు, నేనని వేరుగా బల్కనేల?
ఆత్మయొక్కటె - జీవముల్ రెండుకాని।
అదియు మాత్రము అననేల? ఇందు
వదన।
జీవమును దేహయొక్కటైవేడ్క వెలయు।
అర్థనారీశ్వరులమేము - అమృతులము।

కాముబాధల కోర్వంగలేక కాంత।
వింతరీతిగ వామభాగమునజేరి।
కాంత కౌగిట జొచ్చి అర్ధాంగియగుచు।
నిత్యరతి దేలుభారతీయంబమాకు ॥
భృత్య - సరసంపు సాధ్వి - ఇలమృ
త్యుహరణ।
నీవు, నేనని వేరుగా బల్కనేల ॥

(సారాంశముగ:-ఇచ్చటి పంచభూతములలో, పృథ్వి నేను, గంధమునీవు - ఆపస్సునేను, రసమునీవు - తేజస్సునేను, రూపమునీవు - వాయువునేను స్పర్శ నీవు - ఆకాశము నేను, శబ్దమునీవు - అని పురుషుడు ప్రకృతితో సంబోధించుచు, తుదకు తమ యర్ధనారీశ్వరమును ప్రదర్శింతురు. ఇందలి ధృవగీతికలో "బ్రాహ్మణ" శబ్దమునకు - "బ్రహ్మన్వేషి" యని అర్థము. బ్రహ్మ మనగా వేదమగుటచే "విద్యార్థి" యని అన్వయము. ఈ యర్ధనారీశ్వరత్వము కేవలము దైహికము మాత్రమే కాక, జీవాత్మల ఐక్యతనుగూడ నిరూపించుట యుందలి విశేషములలో మరొకటి)

ఇదేవిధముగ శృంగార ప్రియులకు మా "ఆకాశవాణి" యిటుల రాధా మాధవీయమును చిత్రించెను.

మత్తగజమువునీవు పురుషసింహము నేను -
మర్దించుటకు నీదు కుంభములను।
తేనియలొల్కెడి పెదవుల కుసుమంబునీవు-
ఆ మధు దేలు తేటి నేను।
చక్కని చెక్కుల నవనీతమునీవు -
అదానిని దొంగిలు వెన్నుడౌను।
తెల్లనికన్నుల రతి దేలుదేవివి -
ఆందునల్లని నందు పట్టినేను।
హృదయసాగరమందున వీచికలుగ।
పొంగిపొరలెడి అర్ద్రితరంగమీవు।
నిన్ను అంబుధి దాటించి దరిని దేర్చి।
ముక్తిజూపెడి మాధవునావనేను ॥
నీవునేనని వేరుగా బల్కనేల?

ఇందలి భావము సుగమము. కొదవవిషయములను యింకొకవ్యాసములో బరిశీలింతము.

(సశేషము)

# శివరాత్రి

శ్రీమతి ఆలా సరోజినీదేవి



కాఱు నల్లని కాళ రాత్రి
కాల కంఠుని అర్ధరాత్రి
భూమండల మేలినదీ
బోలాశంకరుని శివరాత్రి !

హిమాద్రిపై హేమాద్రిపై
ఉమా పతియుమా దేవి
తాండవం శివతాండవం
తద్భవ మీ శివరాత్రి !

ఢమ ఢమ ఢమరనాదం
బుస బుస భుజంగ నాట్యం
ప్రమథుల మధురగానం
ప్రసరించి వచ్చె శివరాత్రి !

కైలాస మందిర మంత
విలాసతోరణ మంత
భక్త కోటికి జాగరన
ముక్తికి మూలము శివరాత్రి !

కొండలపై, కోనలపై
కొలువు దీర్చిన శంకరుని
వేలాది ప్రజలేకమై
వేడిరీ శివరాత్రివేళ !

హర హర శంభోమహాదేవ !
హర్షించినదీ శివరాత్రి,
అనంతమైన భక్తులకు
అభయ మీయు మహాదేవ !

---

# సంధ్యలేని దినం

కుమారి కె. హిరణ్మయి



బాధామయగాథ వింటే
వ్యథనాలో కలుగుతుంది ...
ఆ బాధను తీర్చలేను ...
ఈ వ్యథను ఓర్వలేను ...
ఆ కావాడిని నేను ... ఆ
వేళను కలదు నాలో
కార్యము సాధించలేను ...
సాహసించ బ్రతుకలేను ...
రోగుల గాంచిన దుఃఖం
పొంగి పొరలి వస్తుంది.
ఆరోగ్యం ఇవ్వలేను ...
ఆనందం పొందలేను ...

ప్రకృతి దృశ్యాలు నన్ను
మై మరపించి మురిపిస్తవి
సంగీతము రాదు నాకు
తన్మయతను పొందలేను.

ఊహాలు నాలో రేగును
మోహము నాలో వెలయును
వ్రాయలేను కవిత్వం ...
సాగించలేను ప్రణయం ...

ఎందుకు నాకీ హృదయం
సంధ్యలేని దినంవోలె

# "అజ్ఞాత ప్రేమ"

శ్రీ హరగోపాల్



శారదకు లేక లేక పాపాయి పుట్టాడు. పాల బుగ్గలతో పండులా పుట్టిన పాపాయిని చూసి మురిసిపోయింది శారద.

గట్టిగా కరువుతీర ముద్దు పెట్టుకోబోయింది పాపాయిని.

"ఆగు! ఆగు! పసిపాపకు ఊపిరాడదు" అని హెచ్చరించాడు సుధాకర్.

భర్త హెచ్చరికకు సిగ్గుపడి వెనక్కు తగ్గింది శారద.

"నేను ముద్దుపెట్టుకుంటే మీ అబ్బాయి కంది పోడు లెండి" అంది ముసుగును సవరించుకుంటూ.

బలహీనంగా ఉన్న ఆమె ముఖాన్ని, తేల చూపుల్ని పరిశీలించి, చిన్నగా నవ్వాడు బలహీనంగా సుధాకర్.

"పథ్యం సరిగా చేస్తున్నావా?" ప్రశ్నించాడు వాత్సల్యంతో.

"నా పథ్యానికేంగాని, ఈమధ్య మీరు భోజనం, ఫలహారం సరిగా చేస్తున్నారా? వేళకు నేను జ్ఞాపకం చేస్తేనేగాని మీకు తెలిసేదిగాదు. ఆఫీసుపనిలో మునిగిపోయేవారు" అంది ఆందోళనను కనబరుస్తూ.

"ఇన్నాళ్ళు నన్ను చంటిపాపలా సాకావు. కానీ, ఇప్పుడు నువ్వు సాకవలసింది ఈ చంటిపాపను తెలుసా?" ఛలోక్తి విసిరాడు.

"నాకు మీరిద్దరూ రెండు కళ్ళు" అంది పాపాయిని ప్రేమతో నిమురుతూ భర్తకేసి ప్రేమగా చూస్తూ.

"అల్లాగా! మన పాపాయికి ఏం పేరు పెడదాం?" అని అడిగాడు.

"మీకిష్టమైన పేరు. మీకు ఈ విషయం పట్టకపోతే, అత్తగారికీ మామగారికీ నచ్చినపేరు" అంది నవ్వుతూ.

"సరిపోయింది." సాగదీశాడు "ఈ భారం వాళ్ళమీద పెడితే, ఏ పుల్లయ్యో, ఏ శరభయ్యో అని పెడతారు. నాకు నాజూకు పేర్లు తెలియవు. కనుక నీవే ఏదో పేరు పెట్టెయ్యి. మేమందరం పిలుచుకుంటాము" అన్నాడు నవ్వులో నవ్వు కలుపుతూ.

అయిదు నిముషాలు దీర్ఘంగా ఆలోచించింది శారద.

"అయితే! దివాకర్ అని పేరు పెడదాం" అంది ఆశగా.

"దివాకర్!" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు సుధాకర్.

శారద కంపించింది. "అవును. మీరు సుధాకర్, అబ్బాయి దివాకర్. ఒకళ్ళు నాకు వెన్నెల ప్రసాదించితే ఒకళ్ళు నాకు వెలుగు ప్రసాదిస్తున్నారు" అంది తన మనసులోని అభిప్రాయాన్ని కప్పిపుచ్చి.

"అల్లాగా! అయితే వెన్నెలరేడును, వెలుగురేడును నీ దగ్గరే కట్టేసుకున్నావన్నమాట!" అన్నాడు నవ్వుతూ, ఆమె బుగ్గను చిలుకుతూ.

ఆ మాటకు మనసు కుదుటపర్చుకుని "చాలు కొండి!" అంది సిగ్గుపడుతూ శారద.

"అయితే! పోతున్నాను. ఆఫీసుకు టైము అయింది. మళ్ళీ 5 గంటలకు అమ్మగార్ని, అయ్యగార్ని దర్శించుకుంటాను" అని బూట్లు చప్పుడు చేసుకుంటూ వెళ్ళిపోయాడు సుధాకర్.

నవ్వుతూ, భర్త కనిపించేటంతవరకు చూస్తూ వుండిపోయింది శారద. సుధాకర్ చాటుకుపోగానే, ఆమె కళ్ళఎదుట దివాకర్ కనిపించసాగాడు. తెరలు తెరలుగా ఆమె మెదడులో పాతవిషయాలన్నీ సుడులు తిరగసాగాయి.

తను అప్పుడు హైదరాబాదులో B.Sc. చదువు

తోంది. అప్పుడు దివాకర్ M.B.B.S. రెండవ సంవత్సరం చదువుతున్నాడు.

హైదరాబాదు వచ్చిన కొత్త రోజులలో ఇద్దరూ ఒకేసారి సాలర్‌జంగ్ మ్యూజియం చూడడానికి వచ్చారు. అప్పుడు వాళ్ళిద్దరికి ప్రథమ పరిచయమైంది.

చామనచాయ, అంతపొడుగుగాక పొట్టి గాకుండా, చిరునవ్వుతో నవ్వుతో తొణికిసలాడే దివాకర్ ముఖము, అతని చురుకుతనం శారద హృదయాన్ని బాగా ఆకర్షించాయి.

శారదయొక్క అణుకువ, ఆమె ముగ్ధమోహన రూపం దివాకర్‌ను ఆకర్షించాయి. ఆ మ్యూజియంలో ఉన్న కాసేపు వాళ్ళిద్దరూ, అక్కడవున్న వస్తువులు చూడడంమాని, ఒకరి ముఖాల నొకరు, ఒకరికి తెలియకుండా ఒకళ్లు, అక్కడవున్న అద్దాలలో చూడసాగారు.

ఒకరితో ఒకరికి మాట్లాడాలని అభిలాష కాని, మాట్లాడే సాహసం ఏ ఒక్కరికి గూడ లేక పోయింది.

ఒకరినొకరు వదలుకోలేక, ఒకళ్ళు ముఖాన్ని ఒకళ్ళు సిగ్గుపడుతూ చూచుకుంటూ బరువైన హృదయంతో, ఇద్దరు చెరో రిక్షామీద ఎవరి తావులకు వాళ్ళు వెళ్ళిపోయారు.

వాళ్ళ దేహాలు వెళ్ళిన వారి హృదయాలు మాత్రం ఒకదానొకటి వదులుకుని పోలేకపోయాయి.

ప్రతిరోజు అయిదు గంటలప్పుడు పబ్లిక్ గార్డన్‌కు వస్తే ఆమె కనిపిస్తుందేమో అని అతడు, అతడు కనిపిస్తాడేమో అని ఆమె రెప్పవాల్చకుండా చూచుకునేవారు. షైర్‌కు వెళ్ళినా, సినిమాకు వెళ్ళినా వాళ్ళిద్దరికి ఈ ధ్యాసతప్ప మరొకటి వుండేదిగాదు.

ఆరోజున అకస్మాత్తుగా చార్‌మినార్ వద్ద, ఇందిర కనిపించింది శారదకు.

"ఓ శారద! ఉన్నట్లుండి ఒక్కసారి మెరుపులా కనిపించావేమిటే?" అని ప్రశ్నించింది ఇందిర.

"అవునే, మనం నరసాపురం టైలర్ హైస్కూలులో S.S.L.C. చదువుతూ వుండగా విడిపోయాము. మళ్లీ ఇప్పుడే కలిశాము. ఏమిటే! ఇలా వచ్చావు. హైదరాబాద్‌లో చుట్టాలున్నారా?" ప్రశ్నించింది శారద.

"లేదే! మా అన్నయ్య ఇక్కడ మెడిసన్ చదువుతున్నాడు. అకస్మాత్తుగా అన్నయ్యకు ఆరోగ్యం చెడిందని ఉత్తరం వస్తే, మా అమ్మా నేను వచ్చాము" అంది ఇందిర.

"ఇప్పుడు కులాసాగా వుందా?" అని అడిగింది శారద.

"లేదే రోజురోజుకు టెంపరేచర్ పెరిగిపోతోంది గాని ఎక్కడా తగ్గుముఖం కనిపించడంలేదు. చాలా బెంగగా వుందే" అంది బేలగా.

"ఫ్లూ జ్వరమేమో!" అంది శారద.

"ఏమో! డాక్టర్లకే అంతుపట్టలేదు. ఒకసారి మా యింటికి రావే. చాలా రోజులకు కనిపించావ్" అని బ్రతిమాలింది ఇందిర.

శారద, ఇందిర మాట కాదనలేకపోయింది. ఇద్దరూ కలిసి హిమాయత్‌నగర్‌లో ఉన్న ఇందిర ఇంటికి వచ్చారు.

"అమ్మా! శారదను తీసుకొచ్చానే" అంది ఇందిర.

"శారద ఎవరే?" ప్రశ్నించింది మహాలక్ష్మమ్మ.

"నరసాపురంలో నాతో Vth ఫారం వరకు కలిసి చదివిందే, మనవాళ్ళే-ఇప్పుడు ఇక్కడ B.Sc. చదువుతోందిట" అంది.

శారద, మహాలక్ష్మమ్మకు నమస్కారం చేసింది. "శీఘ్రమే వివాహమస్తు" అని దీవించింది మహాలక్ష్మమ్మ ముఖం చాటంత చేసుకుని.

"రావే శారద మా యిల్లు చూద్దువుగాని" అని ఇల్లంత చూపించింది ఇందిర.

"మీ యిల్లు చాలా బాగుందే! అన్నిహంగులు వున్నాయి. హైదరాబాద్‌లో మాకు ఇటువంటిది దొరకడం చాలా గగనం" అంది శారద.

"చాల్లేవే! నచ్చక నచ్చక నీకు యీ యిల్లే నచ్చింది" అంది ఇందిర.

"అదిసరే! గాని, మీ అన్నయ్యకు జ్వరమని అబద్ధమాడావేమే. ఎక్కడా కనిపించలేదేం?" ప్రశ్నించింది నవ్వుతూ శారద.

"ఆదక ఆదక ఇలాంటి అబద్ధాలే ఆడాలా! నీవు సిగ్గుపడతావని తీసుకెళ్ళలేదు. ఆ గదిలోనే

వున్నాడు చూడు'' అని ఆమెను ఆ గది కిటికీ దగ్గరకు తీసుకువెళ్ళి చూపించింది ఇందిర.

శారద, కిటికీలోంచి చూసి ఆశ్చర్యపోయింది. ఏ వ్యక్తికోసమైతే తను, తన కళ్ళు గాలిస్తున్నాయో, ఆ వ్యక్తే ఆమె కళ్ళపడ్డాడు.

''ఎక్కడో చూచిన గుర్తుంది. పేరేమిటి?'' అని ప్రశ్నించింది తను బయటపడకుండ శారద.

''దివాకర్-మా అమ్మ ముచ్చటపడి పెట్టుకుంది'' అంది ఇందిర.

''దివాకర్'' తృప్తికలిగేలా ఉచ్ఛరించింది శారద.

కల్యాణశీలుడైయున్న అతన్ని చూసి ఎంతగానో ఆందోళనపడింది శారద.

''రావే! డాబామీదకు పోయి పిచ్చాపాటి మాట్లాడుకుందాం'' అంది ఇందిర.

''మళ్ళీ వస్తానే! ఆలస్యమైతే అమ్మ కంగారు పడుతుంది'' అని చెప్పి శారద సుల్తానాబజారులో ఉన్న తన యిల్లు చేరింది.

అహర్నిశలు అతన్ని గురించే తను ఆరాటపడ సాగింది. ఇందిర అన్నయ్య అని ఆమెకు ఇంతవరకు తెలియదు. తెలిస్తే, ఈపాటికి అతనితో తనకు పరిచయం కలుగకపోయేదా? అని అనుకుని సిగ్గుతో మురిసిపోయింది. కనుచూపుమేరలోనే తన కలలు నిజమయ్యే ఘడియ వుందని తన మనసు ఎంతగానో వువ్విళ్ళూరింది.

ఆరోజు సాయంత్రం హుస్సేన్‌సాగర్ వద్ద ఇందిర కనిపించింది. దీనంగా ఆ సిమ్మెంటు బెంచీ మీద కూర్చుని, ఆ నీటి కెరటాలను చూస్తూ ఉంది. శారదకు ఆశ్చర్యమేసింది. ఆందోళన కలిగింది. ''ఇందిరా'' అని ఆప్యాయంగా పిలుస్తూ ఆమెను సమీపించబోయింది.

''నన్ను ముట్టుకోకు శారద మయల వచ్చింది' అంది కన్నీళ్లు కక్కుతూ ఇందిర.

''ఆ! నిశ్చేష్టురాలైంది శారద.

మా అన్నయ్య నిన్ననే కన్నుమూశాడు'' అంది భోరున ఏడుస్తూ.

శారదకు కన్నీటిపర్యంతమైంది. ఆమె హృదయం బావురుమని భోరున ఏడ్చింది.

దివాకర్ తన కళ్ళఎదుట మెరుపులా మెరిసి మాయమయ్యాడు. దివాకర్‌తోటి అనుభవాలన్నీ తన జీవితంలో ఒక తీయని కలలాంటిది.

బరువైన హృదయంతో ఇల్లు చేరింది శారద. ఎన్నోరోజులు అతని మూర్తిని మనసులో ఊహించుటకు పరిపరివిధాల పరితపించింది.

ఇటువంటి సమయంలో తనబావ సుధాకర్‌ను వివాహం చేసుకోమని పెద్దవాళ్ళంతా ఆమెను వత్తిడిచేశారు.

సుధాకర్ చాలా తొందరమనిషి. త్రాగేవాడు. పేకాటాడేవాడు. తల్లిదండ్రులను కొట్టేవాడు. కానీ, శారద అంటే పడిచచ్చేవాడు.

ఒకరోజున సుధాకర్ తండ్రి స్వయంగా శారద దగ్గరకు వచ్చి ఆమెను తనకు కోడలం కమ్మని ప్రాధేయపడ్డాడు.

''అమ్మా! శారద! బావ చెడ్డవాడే, మంచి వాడని నేననను. నాకున్న వంశాంకురమల్లా అతను వక్కడే. నీమీద వాడికి మనసుంది. నీవు తలుచుకుంటే, వాడ్ని మళ్ళీ మనిషిని చెయ్యగలవు. నా బిడ్డను, నా పరువు నిలపగలవు. కావాలంటే, నా యావదాస్తిని నీపేర పెడతాను. నా యింటికి లక్ష్మిలా వచ్చి, నా యిల్లు నిలబెట్టు. నా బిడ్డను మనిషినిచేసి నన్ను చరితార్థుడ్ని చెయ్యి'' అని బ్రతిమాలాడు మామయ్య.

''మామయ్యా! పెద్దవాడివి. ఏమిటిది. సరే అలాగే కానియ్'' అంది గుండె రాయి చేసుకుని, భవిష్యత్తును భగవంతునికి వదిలి.

ఆనాటినుండి తన మనసులోని దివాకర్‌ను తన కంటిముందువున్న సుధాకర్‌లో వూహించుకుని, ఇన్నాళ్ళకు తన కడుపున ఆ దివాకర్ నే కన్నాననుకుని మురిసిపోయింది శారద.

•

అందువల్లే తన బిడ్డకు ఆమె దివాకర్ అని పేరు పెట్టింది. ఆమెకు సుధాకర్, దివాకర్ ఇద్దరూ రెండు కళ్ళు. అప్పుడు అంతే. ఇప్పుడు అంతే. ఎప్పుడూ అంతే.

——(o)——

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

చతుర్థాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

౧౦౪

సుప్రకాశంబైన – సుందరరత్న, కే
యూరహారములచే – నొప్పువాఁడు
భూభారముగనున్న – పొలదిండ్ల మూకను,
చిచ్చై – దహించిన – చెలువుకాఁడు
శరదృతు పున్నమ - శశిబోలు ముద్దు న
మ్మోముతో శోభిల్లు మురువుకాడు
పొలుపైన, శ్రీ పద్మముల వంటి కన్నుల
తళుకుచే వెలయు, సౌందర్య విభుఁడు
పాదసేవలు, సుల, భంబుగాదొఱకని
వాఁడు, రామ చంద్రవల్లభుండు
అట్టిరాముసేవ – ననవరతము సేయ
నిచ్చగలదు; కోర్కె పెచ్చుమీఱు.

౧౦౫

ఇంద్రనీలశ్యామ - ఇభరాజవరద! వి
రాధాది రాక్షసవ్రజనివాస!
మకుటాది భూషణ ప్రకరంబుచేత, సిం
గారంబుఁగొన్నట్టి కమలనాథ!
రఘువంశరాజుల – రతనమై వెలుగొందు
రమ్యప్రభావ! శ్రీరామచంద్ర!
ముక్కంటి స్నేహంబు - ముదమారఁగా పెంచి
యుత్సాహమొందు శ్రీ వత్సవక్ష!
దశరథాత్మజ! వరద! సీతావినోద!
శ్రీనివాస! గోవింద! సన్మునివినుత!
లక్ష్మణానుజ! భక్తప్రహ్లాదరక్ష!
నారసింహావతార! జోహారుసేతు.

౧౦౬

శశి కోటి చంద్రికాస్వచ్ఛతమించు
ఆది పీఠంబున – నలరుచున్న
శ్రీరామచంద్రుండు – సీతాప్రియుండు
బంగారు రంగుచే – భాశిల్లు వాఁడు
పద్మశోభితుఁడైన పాదపద్మములు
దనరి, నివృత్త్యాది – తంత్రంబుగల్గు
రామచంద్రుని సేవ – రాత్రింబవల్లు
ప్రేమంబుతో సేతు - ప్రియమారసతము

౧౦౭

భోగభాగ్యంబులఁ బుణ్యాత్ములైయుండు
వారలకును, కడుదూరుఁడగుచు
రాగరహితులైన – యోగీశ్వరులకెల్లఁ
గడు సమీపముగాఁగానఁబడుచు
శ్రీ చిదానందుఁడై - చిన్మయాకారుఁడై
సుజ్ఞానరూపుఁడై – సులభుఁడగుచు
భూపుత్రి, హృదయప్రమోదకారణుఁడయి
చెల్వొందు, శ్రీరాము – శ్రీశుభాంగు
నాది దేవుసతము – నంతఃకరణమందు
నిలిపి ప్రార్థనంబు - నిష్ఠతోడ
సల్పుచుందు మోక్ష సామ్రాజ్యమాకాంక్ష
జేసి, చాలినంత చింతఁగల్గి

౧౦౮ (a)
గొప్పయోగమాయఁ గూడిన వాఁడవై
రాగరసము జిలుకు - రామచంద్ర!
లీలలెన్నఁదరమె? లీలామనుజరూప!
దశరథవరపుత్ర - తమ్మినేత్ర!

౧౦౮ (b)
అతుల సంతసంబు - లానందకరములౌ
నీ విలాస కథలు - నిష్ఠతోడ
వినెడివారియొక్క - వీనులు ధన్యముల్
దశరథ వరపుత్ర! తమ్మినేత్ర!

౧౦౯
గర్వితుండైన, కాకాసురు శిక్షించి
ప్రజ్ఞానమున బోధపఱచియుఁ తని,
నావలయర్థింప నాతండు శ్రీరామ!
నీదయారసము, మన్నించినావు;
వామాంకమందున్న వనజాక్షి జానకి
చెలువారు కన్నుల చెలువ మొసఁగ
దుష్టరాక్షసులను - దునుమాడి, సామర్థ్య
వంతుఁడై - శ్రీరామ! బరగినావు;
ఇంద్రనీలరుచుల - నెసగు, శ్యామశరీర!
సంతతంబు మాకు - సంతసంబు
నొసఁగి శుభ మొసంగి - దోసగులఁబోకార్చి
రక్షసలుపుమయ్య - రామచంద్ర!

౧౧౦
ఫలశ్రుతి
దుర్నీతి కలిగెడు - దుర్మార్గుఁడైనను
పాపస్వభావుఁడౌ - పతితుఁడైన
కర, చెడ్డదిగాఁగ జర్మరోగముతోడ
బాధఁజెందెడు మహాపాపియైన
తలిదండ్రులనుకొట్టి తఱమువాఁడైనను
కొండెముల్ సెప్పెడు కుటిలుఁడైన
దారిద్ర్యఘోర బాధలఁ జెందువాఁడైన
మునులనిందించెడు మూర్ఖుఁడైన

రామకర్ణామృతంబును, వ్రాసి. చదివి
విన్న, అది - వ్యథులుడిగి - ప్రీతికల్గు;
నైహికసుఖంబులొందవు; భోగ్యములు కలుగు
నంత్యమందు, మోక్షప్రాప్తినందుచుండు.

౧౧౧
శివుని స్వరూపుఁడై - చెన్నారు శంకర
స్వామి, గీర్వాణభూషను, లిఖించె
'రామకర్ణామృత' - రసకావ్యమాదిలో
నంతఁజేకూరు, వంశాబ్ధి వెలసి
నట్టి. సిద్ధకవీశ్వరాహ్వాయుండనుపమ
శ్రద్ధఁదెనిఁగించి, రామచరిత
పూదండగాగ, సంపూర్ణభక్తి ప్రేమ
నర్పించినాడు, నీ కతఁడు మొన్న;
యతని పూదండ, కేదండ మర్పణంబు
నేసి, నా భక్తి తెలుఁగునఁ జిన్నిపూల
మాల, నర్పించినాడ! రమా వినోద!
కైకొనుము. నాదు కానుక - లోకనాథ!

౧౧౨
వసుమతిఁగాశ్యపావత్సార - నైధ్రుభ
ము-త్రియారుషేయంబు ముదముగాగ
ప్రవరాన్వితము - కాశ్యపసగోత్రమాశ్వలా
యన సూత్రమందుపై-యధ్యయనము
ఋక్శాఖ; మాతండ్రి కృష్ణార్యుఁడవిరళ
విష్ణుసేవామృత తృష్ణఁగలడు
మధ్వమతస్థుండు - మధువైరి నిత్యంబుఁ
బూజించు భక్తుండు - పుణ్యశాలి
యతని భార్య - అశ్వత్థమ్మ కామె నేను
జ్యేష్ఠుఁడ, నహోబలుఁడని వచింత్రు నన్ను;
బడగనాటివారము; కవిత్వంబు మాకు
వెన్నతోవచ్చినట్టి సద్విద్యయంద్రు.

౧౧౩

పదియునారేండ్లకే - కవిత్వమున, గాఢ
మైన మక్కువ యేర్పడె ; నాంధ్రభాష
యన్న - పద్యంబులన్న - వేమన్న చెప్పి
నట్లు - కవితసాగెను బాల్య మందుకొంత

౧౧౪

సాధనమునఁ గవిత - సాగిన దేకాని
గురులచెంతఁ గొంత గోష్ఠి లేదు;
లక్షణము, దెలియ ; నలంకారశాస్త్రంబు
తఱచి చూడలేదు ; తత్త్వమెఱుఁగ

౧౧౫

తెలుఁగు వారికెల్లఁ దేట తెల్లముగాఁగఁ
దెలుఁగు బాస - తీపి తెలియునట్లు
రచన సల్పినాడ - రామకర్ణామృత
మాదరింపుడయ్య! యాంధ్రులార !

౧౧౬

రామనామ మొండె - రక్తిని ధ్యానించి
వ్రాసినాడ; దీని - రమ్యకీర్తి
జానకీవిభుండు సంగ్రహించెడిగాత!
దాసుఁడైన నన్ను - దయను గాంచి.

౧౧౭

శ్రీరమాపతి నాకిచ్చి చిత్తశుద్ధిఁ
గీలు బొమ్మగఁ జేసి, లిఖింపఁజేసె
నాల్గవప్రకరణము ధన్యాత్ముఁడైతి;
దండమర్పింతు కోదండధారునకును

౧౧౮

రఘుకుల నరనాథా - జానకీప్రాణనాథా!
పితృవచన విధాతా - కీశరాజ్యప్రదాతా!
నిశిచరతతినాశా - ప్రాప్తరాజ్యప్రవేశా
విహితభువన రక్షా - పాతుమాం - రఘు
వేంద్రా

# శ్రీ త్రినాథవ్రతం

(బుఱ్ఱకథ)

శ్రీ పోలాకి శ్రీనివాసరావు



వరా:—ఈ వ్రతమును గంజాయి దొరకని ప్రదేశములవారు సాంబ్రాణితో జేసికొనవలెను.

తందానా హోయి! తందానా!
తానె తందానోయి! తందానా! — హోయి! —
తానె తందానోయి! తందానా॥

శ్రీకరము శుభాకరము
శ్రీ త్రైనాధుల చారిత్రము ॥తందా॥

వీనులవిందు। వెలలేని బంధు
పాపపుంజముల। పారద్రోలునందు ॥తందా॥
శ్రీ త్రైనాధా స్వాముల దలచి
    శ్రీ త్రినాధ వ్రత చారిత్రం ॥తందా॥
శ్రీ పోలాకి శ్రీనివాసరావు
    చిత్తశుద్ధితో వ్రాసె ॥తందా॥

శ్రీకరమైనా వెండికొండపై
    వెలగు మహేశ్వరుని ॥తందా॥
పార్వతీ సతీ ప్రియవచనంబుల
    ప్రశ్నింపగ దొడగె॥
ప్రాణేశ్వర భూలోకమందు గల
    ప్రజలు మోక్షమొంద।
సులభమైన వ్రతరాజం బొక్కటి
    తెలుప వేడెదను దేవ।
అనగ మహేశుడు పార్వతిదేవితో
    ననియె నిట్టులనుచు।
"పేదవారలూ భాగ్యవంతులను
    భేదము లేకుండా।
అందరు ప్రజలు ఆచరించుటకు
    అందుబాటుగాను।
శ్రీ త్రినాధ వ్రతరాజం బొక్కటి
    చెలంగు చుండెనుగా।
ఆ వ్రత విధానమంతయు భక్తితో
    పాలింపుము దేవీ!

శ్రీపురంబులో బ్రాహ్మణు డొక్కడు
    కాపురమున్నాడు ॥తందా॥

మధుసూదను డను పేరుతోడ నా
    మాధవ భక్తుండు।
కాంతాదేవి యన్న పేరుగల
    సాధ్వీమణితోడ।
అనుకూల కాపురము జేయుచుండె నా
    ఘనుడగు భూసురుడు।
నిరుపేదతనంబున బహుకష్టమ్ముల
    బరగుదు రా దంపతులు।
ఉపవాసంబులు జరుపుచుండి రా
    ఉత్తమ దంపతులు।
శ్రీహరి కటాక్షమ్మున వారికి
    చిన్నిబాలుం డుదయించెన్।
ఆ బాలుని పోషింపగ వారికి
    నలవిగాక యుండెన్।
పాలులేక యా పసిబాలకుడు
    గోలు గోలునా ఏడ్చు।
ఏమి తోచదా తల్లిదండ్రులు
    ఏమి చేయగలరు?

వచనం:–అహా!

పిల్లవాని సోదార్ప జాలరా
    పేదబ్రాహ్మణులు।

మిశ్రం:—తమ గృహంబులో। చిరకాలముగా।
సున్నటువంటి। బిందె, చెంబు। కంచము, గ్లాసు।
కుదువబెట్టినారూ॥ తందానా। ఓ దేవ వందనాలు॥
ఆ పైకముతో ఆవు నొకటి కొనగా ॥తందా॥
మధుసూదనుడు వీధులందు తిరిగె॥
విదు రూకలతో ఆవు దొరకగలదా?
అహా! దైవ విచిత్రంబదియేమో ॥తందా॥

వచనం:—ఒక కాపువాని వద్ద బాహుళి యన్న పేరుగల ఆవొకటి ఉండేది. అది చాల పెంకి యావు. కనుక, ఆ కాపు దాని అల్లరిని భరింపలేక మధుసూదనునకు విక్రయించాడు.

బాహుళ యన్న తుంటరి యావును
బ్రాహ్మణుండు తెచ్చి ||తందా||
పెంచుచుండె తన చిన్ని బాలుని
ప్రేమమీరగాను।
కట్టుత్రెంచి యా కొంటెయావు ఏ
పట్టున కేగినదో।

ఆవుదూడకూ పాలూ లేవాయె। — సై!
పిల్లవానికీ పాలూ లేవాయె। — సై!
"అంబా! అంబా! అంబా" యనుచు
అరచుచుండె దూడ ||తందా||
"అమ్మా! అమ్మా! అమ్మా" యనుచు
ఏడ్చుచుండె బిడ్డ।
జాలిబొంది మధుసూదను డావు
జాడను తెలియుటకు।
పశువుల శాలలు, పొలములు, పచ్చిక
బయళ్ళందు జూచె।
ఎచ్చట జూచిన ఆవు జాడ తన
కేమి దోచదాయె।
ఎవ్వరి నడిగిన ఆవు జాడ తన
కెరుక పరచరాయె॥

వచనం:_ఇలా వెదకి వెదకి ఆనాడు జరుగుతూన్న సంతలో తన యావు లభింపగలదేమో యని మధుసూదనుడు సంతకు పోవుచుండెను. ఆనాడు తీక్షణముగా ఎండ గాయుచుండెను.

ఎండవేడిమికి శిరస్సంతయు
మండిపోవుచుండె ||తందా||
పాదములందున బొబ్బలెక్కి కడు
బాధింపుచు నుండె।
నోటియందు తడియార్చుక పోయి
మాట వెడలకుండె।
దాహముతోడను శరీరమంతయు
తాప మొందుచుండె।
మార్గమందున మధుసూదను డొక
మఱ్ఱినీడ నిలిచి।
తన దరిద్రతకు పరిపరి విధముల
దలపోయుచునుండె।

వచనం:_ఆ సమయమున బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులగు త్రైనాధులు ప్రపంచ చిత్రముల దెలిసికొనుటకు ఆ మార్గమున పోవుచూ మధుసూదనుని మొఱవిని బ్రాహ్మణ రూపధారులై మఱ్ఱి వృక్షము చెంతకు వచ్చారు. మధుసూదనుని చరిత్రమంతయు తెలిసికొన్నారు.

సంతకు పోయే బ్రాహ్మణ మాకు
సంతస మొసరించు ||తంద||

ఒక పైసావి వక్కలాకులు — సై!
ఒక పైసాకు గంజాయి పత్రము — సై!
ఒక పైసాకు నూనె దెచ్చియిమ్మ ||తందా||

వచనం:_గంజాయి లభింపకుంటే, సాంబ్రాణి నైనా దెచ్చిపెట్టుము.

నీ యావు లభించే విధానమంతయు
నీకు జెప్పగలము ||తందా||
అనగా బ్రాహ్మణు డాశయు దుఃఖము
అతిశయింపగాను।

మిత్రం:
తినుటకు తిండిలేనివాడను ||తందానే తందానతందనా||
కట్టగ బట్టలేనివాడను। ,,
రొక్కము చేతను లేనివాడ। ,,
మూడు పైసలా–సామగ్రుల మీకూ। ,,
ఎక్కడ దెచ్చి - యీయగలుగువాడా ||తందా||

వచనం:_అంత త్రిమూర్తులు
పైసాలివిగో పట్టుకపోయి
తీసుక రమ్మన్న ||తందా||
సంతకుపోయి మధుసూదనుడు
సామగ్రుల కొనక।
మొదవు దొరకగలదన్న యాశతో
మొదవును వెదికెనుగా।
మొదవు దొరుకకపోవుటచే తన
హృదయము పాడయ్యె।
వెఱ్ఱివానివలె చైతన్యము చెడి
వెఱ్ఱిగాను తిరిగి।
తములపాకులు వక్కలు గంజాయి
క్రమముగ కొన్నాడు।
నూనె యంగడికి బోయి తెలుకలిని
నూనె నిమ్మటంచు।
అంగవస్త్రమును చాచగ నీతడు
వెంగళప్ప యనుచు
తెలుకలి పైసా గైకొని కొద్దిగ
కొలిచి యిచ్చె నూనె।
మహాత్ములగు త్రైనాధస్వాముల
మహామహిమవలన।

పోయమరయ్యెగా కలశల నూనె
మచ్చుకైన లేక ।
భ్రమతో తెలుకలి మధుసూదనుని
పాదములకు మ్రొక్కి ।
నేరముజేసితి క్షమింపు తండ్రీ !
కృపారాత్ముడ నేను ।
తప్పు వర్తకముజేయ నెన్నడూ
తండ్రీ గాపాడు ।

వచనం:—అనగా మధుసూదనుడున్నూ విభ్రమము జెంది ఏమీ దోచక తనవద్దనున్న నూనెను ఒక కలశలో పోశాడు.

పోయగానె యీ కలశలన్ని పరి
పూర్ణము అయ్యెనుగా ॥తందా॥
తెలుకలి నూనెను న్యాయముగాను
కొలిచి యిచ్చె మరల ।
మధుసూదనుడు బయలు దేరెను
మట్టికడకు వేగ ।
సామగ్రుల త్రైత్యాదుల కొసగెను
సాధు బ్రాహ్మణుండు ।
సంతను జరిగిన నూనెయొక్క వృ
త్తాంతము దెలిపెనుగా ।

వచనం:—అంత నా స్వాములిట్లు చెప్పారు. ఓయి బ్రాహ్మణుడా! శ్రీ త్రినాధస్వాముల వారి వ్రతము చేయుటకుగాను యీ సామానులను నీకు దెమ్మంటిమి. శ్రీ స్వాములవారి మహిమవల్లనే సంతలో అటుల జరిగినది. కనుక మహత్తుగల యీ వ్రతమును నీవు చేయుము.

శ్రీ త్రినాధ వ్రత మాచరింపు మా
చింత దీరగలదు ॥తందా॥
దారిద్ర్యమ్మను తొలగిపోయి ధన
ధాన్యాదుల తోడ ।
తుల – దూగగలవు నీ ఆవు సైతము
దొరకును బ్రాహ్మణుడా ॥
అనుచు త్రినాధ వ్రత విధానమును
అతనికి చెప్పారు ॥తందా॥

"వినుమా! భక్తిని భక్తవరేణ్యా !
విశదంబుగాను ॥
బ్రహ్మ, విష్ణు, పరమేశ్వర ప్రముఖులు
పరమప్రీతి జెంద ॥

శ్రీ త్రినాధ వ్రతరాజం బొకటి
చెలంగుచుండె ।
వ్రతము చేయుటకు భక్తియొక్కటే
వరసాధనంబు ।
జాతి, మత భేదముల ను పాటింప
జనదు వ్రతముజేయ ।
తిథియు, వార, నక్షత్ర కరణముల
విధులు లేవు లేవు ।
ఉపవాసములను సలుపంగ బనిలేదు
ఉత్తమ చిత్తంబే వలయు ।
మూడు పైసాలతో వ్రతము జేయవచ్చు
ముక్తిని గాంచుటకు ॥

ఒక పైసాకు నూనెను దేవరా ।
ఒక పైసా వక్కలాకులు దేవరా ।
ఒక పైసా గంజాయిని దేవరా ।
గంజాయి లేకున్న సాంబ్రాణి దేవరా ।

మూడు వంతు లిడుచు ।
ముమ్మూర్తులకూ ।
పంచిపెట్టి సమర్పించ గావలె ॥తందా॥
మూడు దీపముల వెలిగింప గావలె
ముమ్మూర్తుల చెంత ।
ఇచ్ఛానుసారముగ పదార్థముల
నీయంగా వచ్చు ।
ఫలము, పత్ర, పుష్పముల నీయవచ్చును
జలంబీయవచ్చు ।
వక్కలాకులే ముఖ్య ప్రసాదం
బని తలంచవలెను ।
ప్రసాదము కొరకు జగడములాడిన
ఫలము కలుగబోదు ।
వ్రతము ముగియక మున్నె పొయ్యేవారికి
వెతలు దప్పకుండు ।
వ్రతకాలమునందు అల్లరులు చేసిన
గతులు కలుగకుండు ।
వ్రత విధానమెల్ల యీ రీతిగా దెలిపి
వ్రతమును జేయించిరి ॥
మూడు మంటపా లమర్చినాడు
॥మధుసూదనుడు–మధుసూదనుడు॥
ముమ్మూర్తులను స్థాపించినాడు
॥మధుసూదనుడు–మధుసూదనుడు॥
పంచిబెట్టినాడు వక్కలాకులను
॥మధుసూదనుడు–మధుసూదనుడు॥

పంచిపెట్టినాడు గంజాయిపత్రము
||మధుసూదనుడు–మధుసూదనుడు||
మూడు ప్రమిదలను నూనెను పోశాడు
||మధుసూదనుడు–మధుసూదనుడు||
దీపములు వెలిగింపజాల లేకున్నాడు
||మధుసూదనుడు–మధుసూదనుడు||

వచనం:–అప్పుడు త్రిమూర్తులు యిలా అన్నారు. "ఓహో! ఎందుకయ్యా! అలా విచారిస్తావు, కండ్లు మూసికొని త్రినాథులను ధ్యానించవయ్యా! వారి మహిమ నీకు తెలుస్తుంది" అనగా మధుసూదనుడు త్రినాథులను ధ్యానించాడు. పిమ్మట కండ్లు తెరచి చూచునప్పటికి దీపములు వెలుగుచుండెను. అక్కడ నుండే మహానుభావులు ముగ్గురూ మాయమయ్యారు.

ఎంతటి పాపాత్ముండనో నేను
ఎరుగజాలనైతి ||తందా||
ఇంతటి మహానుభావులనుచు నే
నెరుగజాలనైతి।
నుంతయైన భగవంతులనుచు నే
నెరుగజాలనైతి।

వచనం:–ఇలా విచారించి, స్థిరచిత్తముతో వ్రతము చేసి తన యింటికి పోయియుండెను. అక్కడ

ఆనందమయ్యా! ఆనందము!
ఆనందమే గదా! అమరప్రదం!

మధుసూదనుని యిల్లు భవనంబయా!
మహా! భవనంబయా!
మధుసూదనుని యాలు మహాలక్ష్మియా!
ఆమె మహాలక్ష్మియా!
వెలలేని సంపదలు తులతూగుతున్నాయి!
తొలగి వెళ్ళిన యావు వచ్చిందయా!
ఆవు వచ్చిందయా!

వచనం:–మధుసూదనుడు సకలమైన భాగ్య భోగములతో తులదూగుతూన్నాడు. శ్రీ త్రినాథ వ్రతము లను మిక్కిలి భక్తితో సలుపుచున్నాడు. ఈ శ్రీపుర ప్రజలు తెలుసుకొన్నారు. శ్రీ త్రినాథ వ్రతములను సలుపుతూ సమస్త సౌభాగ్యములు కలిగి సంతోషముగా నున్నారు. ప్రజలిట్లుండుటవలన శ్రీపురమందలి ధనమదాంధులైన వర్తకులు మత్సరము పొంది ప్రజలయందు అసూయత చెందారు. ఈ వర్తకులున్నూ భక్తితత్పరులు గాక గొంతెమ కోరికలతో త్రినాథ వ్రతములను చేశారు. వీరికి ఎట్టి విధమైన ఫలితములు కలుగలేదు. మరియు, ప్రజలు వర్తకులవద్ద సామానులను కొనవలసిన అవసరముకూడ శ్రీపురములో కలుగలేదు. అందువలన వర్తకులకు వ్యాపారములు మందగించినవి. వర్తకులు ఎట్టి లాభములను పొందజాలకుండా నున్నారు. కనుక వారు శ్రీపురమును పాలించే రాజుగారి వద్దకు పోయి ప్రజలపై కొండెములు చెప్పబూనారు.

వందనమయ్యా! వందనమయ్యా!
వందనమ్ములయ్యా! ||తందా||
వందనమయ్యా! శ్రీపుర రాజా!
వందనమ్ములయ్యా।
వందనమయ్యా! మహారాజా!
వందనమ్ములయ్యా।
మన పురమందలి ప్రజలందరు ధన
మదమున నున్నారు।
శ్రీ త్రినాథ స్వాముల వ్రతమొకటి
చేయుచున్నారు।
ఆ వ్రత మహిమచే అందరు ప్రజలు
అతిశయించినారు।
మిమ్ము మించిన భాగ్యభోగముల
మెలగుచున్నారు।
మీదు యాజ్ఞలను తలను దాల్పక
మీరదలచినారు।
రాజ రాజ మహారాజా మీకు
పూజ్యతయే లేదు।
ప్రజలు మీదు రాచరికంబును
పాడుచేయగలరు।

వచనం:–మధుసూదనుని యొక్కయు, ప్రజల యొక్కయు వృత్తాంతమంతయు చెప్పగా రాజు విని కోపోద్దీపితుడై "ఆహా! నా రాజ్యములో ఎవరైనను త్రినాథ వ్రతమును చేయించినట్టయితే, లేక చేసినట్టయితే కఠినముగా శిక్షిస్తాను.

చెట్టున కట్టించి చీలల వేయింతు ||తందా||
కరకర అంపమున శిరముల కోయింతు।
గడ్డమీద ఛేరికింతు, పండ్లమీద గొట్టింతు
కండకండలు, కోయించి కాకుల గ్రద్దలకు
వేయింతు ||తందా||

వచనం:–"ఈ నా అనుమతిని అందరూ పాటించాలి!" అని శ్రీపురమందలి అన్ని వీధులలోనూ చాటింపించాడు.

దుర్మార్గపు రాజుల దుండగమ్ములను ||తందా||
నిరంకుశత్వపు పరిపాలనమును ।
బలవంతుల మద గర్వ బలంబులను
అహా ! బలహీనులనూ !
దీనజనులనూ !
బాధించును గాదా ||తందా||

రాజు ఆపతికి భయపడి త్రినాధ
పూజలు విడిచారు ||తందా||
మానసమందే ప్రజలు త్రినాథుల
ధ్యానించుచు నున్నారు ।
పంచభూతముల బలమగు శక్తిని
ప్రతిఘటింపలేని ।
మానవేంద్రుడు దైవబలమునకు
మారుచెప్పగలడా ।
చావు పుట్టుగలు జయింప శక్తి
చాలని మానవుడు ।
జయింపగలడా దైవబలంబును
జన్మజన్మములకైన ।
శ్రీపుర రాజకుమారుడు మూర్ఛను
జెందె దైవ విధిని ।
ఆ కుమారకుని స్మశానవాటిని
అగ్నిని రవులింప ।
సిద్ధముగానున్నట్టి సమయమున
సిద్ధుల గతి ముమ్మూర్తుల్ ।
వచ్చి - త్రినాథుల వ్రతము జేయ మీ
బాలుడు బ్రతుకు నన
రాజు త్రినాథుల మానసమందున
పూజించెను భక్తిన్ ।
బాలుడు బ్రదికెను శ్రీపుర రాజు
ప్రమోదమ్ము నందె ।
కోలాహలమున ప్రజలందరును
ఓలలాడు తరిని ।
సిద్ధులు ముగ్గురు మాయమైరి తమ
ప్రసిద్ధి తెలియుటకు ।
శ్రీ త్రినాథ స్వాముల మహిమము
శ్రీపుర రాజెరిగె ।
ఆ స్మశానమునందే జరిపెను
వైభవమున వ్రతము.

వచనం:-ఆ స్మశానమునకు చేరువగా స్వర్ణభద్రా నది పారుతూంది. ఆ నదీ మార్గమున ఏడు ఓడలతో సరకులు పట్టించుకొని విక్రయించుటకు ఒక వర్తకుడు పోతూన్నాడు. ఈ స్మశానములో జరుగుతూన్న త్రినాధ వ్రత విధానమును తెలిసికొని చాలా సంతోషించాడు. తాను కూడా శ్రీ త్రినాధ స్వాములను మనస్సులో తలంచి ఇట్లు కోరుకొన్నాడు.

ఓ స్వాములారా ! ఓ స్వాము లారా !
త్రైత్రినాథు లారా ! త్రైత్రినాథులారా ।
ఏడు ఓడలా సరకులు చెల్లిన !
ఎంతైన లాభము ఏర్పడి యుండిన ।
ఏడు వ్రతములు యిచటనే చెల్లింతు ||తందా||

వచనం:-అని, ఆవర్తకుడు వర్తకమునకు వెళ్లాడు. అతడు కోరుకొన్న రీతిగా ఏడు ఓడల సరకులూ చెల్లి ఎన్నో రెట్లు లాభము కలిగెను. ఆ ఏడు ఓడలలోనూ ధనమును నింపుకొని తిరిగివచ్చాడు. ఆ స్మశాన సమీపమున స్వర్ణభద్రానదిలో ఓడలను నిలుపకుండా, వ్రతములు చేయకుండా ధనమదాంధత ను పోతూన్నాడు.

బుడ బుడ ఓడలు మునుగు చుండెనుగా || తం
గడ గడ ఒడలూ వణకుచు నుండెనుగా ||
ఆకాశ వాణి యపుడు పలికెనుగా ।
ఓధన మదాంధా ! వ్రతములు చెల్లించు ।
ఓయి వర్తకుడ వ్రతములు చెల్లించు

వచనం:_అంత వర్తకుడు తెలివి తెచ్చుకొని శ్రీ త్రినాథులను మ్రొక్కగా, తిరిగీ ఓడలు ధనముతో దేలినవి. పిమ్మట నా వర్తకుడు ఆస్మశానము నందే ఏడు వ్రతములను చెల్లించి, ఇంటికిపోయి మహా వైభవముగా ప్రతి దినమూ వ్రతములు చేయుచున్నాడు. ఆ వ్రతమువద్దకు వెళ్లిన వారందరికీ ఉచితమైన ఫలితములు కలుగుతూ ఉన్నవి.
గ్రుడ్డివారికి కన్నులు వచ్చాయి ||తందా||
గొడ్డు వారికి బిడ్డలు కలిగారు ।
సొట్ట వారికి సొట్ట తీరి యుండె ।
రోగులు ఆరోగ్యమ్మును పొందారు ।
ధన విహీనులకు ధనము కొరత దీరె।
అచటకు బోయిన వారందరు
అదృష్టవంతు లయిరి ||తందా||

వచనం:_ఆ వ్రతమును చూచుటకు
బైరాగీ యను బాలకు డొక్కడు
ప్రతి దినమ్ము వచ్చు ||తందా||
వ్రతము ముగియుటకు పూర్వమె తాను
వ్రతము విడిచి పోవు।

వ్రత నియమమ్ముల పాటింపనిచో
వస్త్రము కడకు రావలదు।
అని భక్తులు గద్దింపగ బాలుం
డటులే యని నిలిచె॥

వచనం:-అంత నా బాలకుని గురువు అచ్చటకు వచ్చి తన యనుమతి లేనిదే పూజ వద్దకు వచ్చాడని బాలకుని దండించి తన వెంటదోడ్కొని పోయెను.

"భళానోయి! భాయి! తమ్ముడా! సై!
భాయి! భాళానోయి! దాదానా!
గురువు కొడుకు చచ్చి, పడియుండె యింటను
గురువు మిగుల ఏడ్చుచుండెను।
వ్రత మహాత్మ్యమ్మును తెలిపెను శిష్యుండు
వర త్రైనాథుల పూజించె గురువు।
గురువు కొడుకు బ్రతికె గురువు సంతసమొంద
గురువు వ్రతములను చేయదొడగెను॥

వచనం:-ఈ రీతిగా —

పార్వతికి శంకరుడు వ్రతము విధము తెలిపె ॥తందా॥
ఆమె చేత వ్రతము లాచరింపజేసె।
త్రినాథ స్వాములు మఱ్ఱి చెట్టు చెంత।
తెలిపిరి వ్రతమును మధుసూదను నకు।
మఱ్ఱి చెట్టు చెంత వ్రతము చేయవలె।
మఱ్ఱి కొమ్మ తెచ్చి యింటనైన వ్రతము।
చేయంగా వచ్చు ॥తందా॥

వచనం:-ఓ భక్తశిఖా మణులారా!

శ్రీత్రినాథ వ్రత మహాత్మ్యమును
చెప్ప తరము గాదు। ॥తందా॥
కాటుక కొండల వలె పెరిగే
కర్మము లెదబాపు।
వ్రతము జేసినను భక్తిని విన్నను
వరలును మోక్షమ్ము ॥తందా॥

భజియించండీ!
భజియించండీ!

భక్తులార! మీరూ!
ముక్తి బొంద గలరు!

ఆచరింపు!
ఆచరింపుడీ! - శ్రీ -
త్రినాథ వ్రతములను!

— మంగళం —

మంగళ మో బ్రహ్మ దేవ!
మంగళ మో విష్ణు దేవ!
మంగళ మో మహా దేవ!

మంగళం మహా!

— ముగిసెను —




# ఎత్తుకు పై ఎత్తు

శ్రీ డి. బి. నారాయణకృష్ణారావు

ఒక ముసలి సింహం జబ్బుతో లేవలేక ఒక గుహలో పడివుంది. అడివిలో జంతువులన్నీ వచ్చి మృగరాజును పరామర్శచేసి వెళ్ళి పోతున్నాయి. నక్క మాత్రం సింహాన్ని చూడ్డానికిరాలేదు. ఈ అవకాశం కనిపెట్టి తోడేలు తన విరోధి అయిన నక్కపై చాడీలు చెప్పింది.

'మృగరాజా! నక్కకు మీరంటే ఎంత నిర్లక్ష్యమనుకున్నారూ? జంతువులన్నీ వచ్చి మిమ్మల్ని చూచి పోయినాయి. నక్క మాత్రంరాలేదు. దాని కెంత పొగరో చూడండి.' అంటూ తోడేలు సింహానికి పురి ఎక్కించింది.

ఈ మాటలన్నీ కొంచెం దూరంగా పొంచుకొనివున్న నక్కకు వినిపించాయి. తోడేలు తనమీద చాడీలు చెప్పుతున్నదని గ్రహించింది. వెంటనే సింహం డగ్గరకు వచ్చి నమస్కరించింది, కాని తోడేలు చెప్పినమాటలు తల కెక్కడం వల్ల సింహానికి నక్కమీద కోపంగావుంది. దాన్ని చూడగానే సింహం గర్జిస్తూ మీద పడబోయింది. అప్పుడు నక్క వినయ విధేయలతో ఇలా ప్రార్థించింది.

'మహారాజా! నాపై ఆగ్రహించకండి. ఇంతకాలం తమనుదర్శించడానికి రానికారణం మరేమీకాదు, తమకు ఆరోగ్యం చేకూరడానికి మార్గమేమిటా అని ఇంతకాలం నుంచీ వెదుకుతున్నాను. దేశంలోవున్న ఘన వైద్యులందరినీ విచారించాను, చివరకు తమ వ్యాధి నయంకావడానికి మందు దొరికింది, మహా ప్రభూ!'

నక్క అలా చెప్పేసరికి సింహానికి సంతోషమైంది.

'ఏమిటి? ఏమిటా మందు? త్వరగా చెప్పు' అంటూ సింహం తిరిగి ప్రశ్నించింది.

'ఏమీలేదు మహారాజా! చాల సులభమైన వైద్యం. బ్రతికివున్న తోడేలును చంపి దాని చర్మం వంటిమీద కప్పుకుంటే చాలు, మీ వ్యాధులన్నీ పటాపంచలై పోతాయి మీరుమళ్ళీ యౌవ్వనవంతులవుతారు' అని వైద్యం చెప్పింది నక్క.

అది వినగానే సింహం తోడేలు మీద పడి దాన్ని చీల్చివేసింది. 'ప్రభువులతో ఇతర్ల మీద చాడీలు చెప్పేవాళ్ళగతి, అంతే అవుతుంది' అనుకుంటూ నక్క వెళ్ళిపోయింది. చూచారా బాలలూ! తాటి చెట్టుఎక్కేవాడికి దలదన్నే వాడుంటాడు. ఒకరిని చెఱపబోతే తానే చెడిపోతాడన్న సంగతి మరచి పోకండేం!

# కాకియై కలకాలం

---

రంగశ్రీ

బ్రహ్మదేవుని గూర్చి
తపము చేసెను.
కాక పికములు
బడయు వరములు.

అంత విధాత మెచ్చి
ప్రత్యక్షమయ్యె.
కోరుకొమ్మనియె
వలసిన వరాలు.

పరులానందించగ
కోకిల తన కంఠాన
కమ్మని గాత్రము
కావాలని వేడింది.

పరులకోసం తాను
త్యాగ కుమిటని
కాకి కలకాలం
జీవించగ కోరింది.

వలసిన వరాలిచ్చి
మాయమయ్యె విధాత.
"వరాలలోని భేదం
అరసిచూడు బాల."

కాకియై కలకాలం
బ్రతుకుట కంటె
కోకిలగా కొద్దికాలం
మనటం మేలు గదా!

---

(51 వ పేజి తరువాయి)

జ్వలమై నాయకత్వం వహించడానికి ఆసక్తితో కృషిచేసినచో యీ నాటి లోటు పాట్లుండవు. గాంధీజీ నాయకత్వంలోని విశిష్టతననుసరించి తాముధర్మం, న్యాయం అని నమ్మినదాని సాధనకు ఎట్టి త్యాగమైనా వీరోచితంగా చేయపూనకుంటే యీనాటి కాంగ్రెస్‌లోని లోటుపాట్లు సర్దుకుంటవి. కాంగ్రెస్‌ను సంస్కరించడమనేది ప్రజల ఆసక్తి, చిత్తస్థైర్యాలమీద నాధారపడియుంటుంది. ఈ నాడు ఆనాడుకూడ విశాలదృక్పథంతో సేవాత్యాగాలు పునాదులుగా ఉమ్మడిశ్రేయో సౌభాగ్యముల తీర్చిదిద్దడానికి కంకణము కట్టుకున్న కాంగ్రెస్ నాయకత్వమును యీ నాడు మరింత బలీయము చేయుట విజ్ఞతకాని విమర్శించుటతో మాత్రం లాభం శూన్యం. పూర్వపు తమ వ్యక్తిగత ఆధిక్యతను, అధికారములను అవకాశములను స్మరించుకుంటూ ఉమ్మడిశ్రేయస్సుకు భిన్నముగా ఏర్పడు ఏరాజకీయ పక్షాన్నికాని, ఉద్యమాన్నికాని ప్రజలు సహించరు, అనుసరించరు. ఉమ్మడి సౌభాగ్యంవలదంటూ వ్యవసాయ, పారిశ్రామికరంగాలలో శాశ్వతంగా బానిసలుగానుండిపోవాలని కోరుకునేవారు వెర్రిబాగులవారు కాక మరేమనాలి?

---

(72వ-పేజీతరువాయి)

పరంధామయ్యగారికి సుబ్బారావు - పార్వతి యిద్దరే సంతానం. నిక్షేపంగా పదెకరాల మాగాణి భూమి వున్నరోజుల్లో పరంధామయ్యగారు కవి సమ్మేళనాలనీ, భజనలనీ, నాటకాలనీ, హరికథలనీ-వున్న ఆస్తినంతటిని దూబరగా ఖర్చుచేసిపారేశాడు. తీరా సుబ్బారావు చదువు పూర్తిగావించుకొని, స్వశక్తిమీద బ్రతకటానికొచ్చేసరికి, ఒక పెంకుటిల్లు, మూడెకరాలు పల్లం దీనంగా మిగిలింది....పరంధామయ్యగారు మహాజల్సామనిషి. లౌకికుడూ. కాని యేం లాభం? కొడుకూ – కూతురూ ఒక యింటివారయ్యేసరికి ఆయువు ముంచుకొచ్చింది. అప్పు తీర్చకుండానే అస్తమించటంతో సుబ్బారావు వున్న పిత్రార్జితం పూర్తిగా అమ్మేసి, కొంత అప్పుతీర్చి, మిగతాది మురారి చదువుకి వినియోగపర్చాడు. పరంధామయ్యగారు చేతులారా సంపాదించిన యింత ఆస్తీ వున్నట్టుండి హరించిపోవటం కొందరికి ఆశ్చర్యాన్ని కల్గించింది. బహుశా! 'పరంధామయ్యగారు చెడ్డగా తిరగబట్టే యిలా అయిందని' కొందరు వ్యాఖ్యానించారు. 'కాదూ. ఆయనగారికి బెజవాడలో ఒక వుంపుడుగత్తె వుందీ! దాని పోషణకై ఆస్తిని అమ్ముతూ వచ్చాడు...అప్పూ చేశాడూ' అని మరికొందరు విమర్శించారు. 'ఛా...ఛా...అదేమీ గాదు. ఆయన గొప్ప బ్రాకెట్ ఆటగాడు. చీట్ల పేకా ఆడుతాడు' అని ఒక రకంగా తీర్మానించారు కొందరు. 'ఏదైతేనేం సంపాదించిన ఆస్తినంతా తగలేశాడు' అని బుద్ధిమంతులు చివరకు వొప్పుకున్నారు. అందువల్ల పరంధామయ్యగారి కొడుకు సుబ్బారావు గదా! అతని కొడుకు మురారి గదా! తాత బుద్ధులు కొడుక్కి రాకపోయినంతమాత్రంచేత మనవడికెందుకు రాకుండా వుంటయి! అని సుబ్బారావుని ఎడాపెడా వినుగుత్తేలాగు విమర్శిస్తూ వుంటారు, పెద్దవాళ్ళెప్పుడో తప్పుచేశారని, పిన్నలిప్పుడు తప్పుచేయగలరని ఏమిటీ ఖరారు. వంశంలో ఒకడు చెడువాడయితే వంశం అంతా చెడుతుందా? కాంతమ్మకీపాటి విమర్శనాత్మకమైన ఆలోచన వున్నట్లయితే, మురారి ముమ్మాటికీ సావిత్రికి భర్తయ్యేవాడే...ఆనందం కల్గేదే !! పరంధామయ్యగారి మూలాన సావిత్రి మురారికి దక్కకపోయిందని పార్వతి యిప్పుడెన్నిసార్లు అనుకున్నా యేం ప్రయోజనంలేదు. సుబ్బారావు యెంత పరితపించినా కల్గే లాభమూ లేదు. దేనికైనా అదృష్టం వుండాలి. యెవరి ప్రారబ్ధాన్నిబట్టి వాళ్ళలా జీవిస్తాంటారు. సీతాపతి మనసును కాంతమ్మ యీ రకమైన ధోరణితో విరిచేసింది. సావిత్రిని పరాయింటి కోడలిగాచేసి సంతోషించింది. పార్వతి మీద కక్ష తీర్చుకొంది అర్థంలేకుండా.

చివరకు సావిత్రి సంఘాచారాలకు తలవొంచి, రమణమూర్తితో కాపురం చేయటానికి వెళ్ళి రెన్నెళ్ళయింది. యీ రెన్నెళ్ళ కాలంలో రమణమూర్తి, సావిత్రిపట్ల తన వ్యక్తిగతాభిప్రాయాన్ని ఎలాగైనా వెల్లడిచేయాలని చాలావరకు ప్రయత్నించాడు. యెప్పటికప్పుడే అది ఎందుకో నిష్ప్రయోజనమై పోతుండేది. తనలో ఏ దౌర్భాగ్యం గట్టిగా పాతుకొని, చేయాలనుకున్న ప్రయత్నానికి అడ్డుపడుతూ వుందో స్పష్టంగా తెలియటంలేదు. సావిత్రితో కులాసాగా మాట్లాడటానికి యెందుకో జంకుతూ వుండేవాడు. తీయగా – లాలనగా చూడాలనిపించేది. కాని అంతలోనే నామర్దా వేసేది. సావిత్రిపట్ల గౌరవనీయమైన భావమేదో క్షణక్షణానికి వృద్ధి పొందుతూండేది. దాన్నయినా సాహసించి ఏకాంత గృహంలో ముచ్చటగా ప్రకటించలేకపోయేవాడు. సావిత్రి నిత్యమూ తనపై చూపే నిర్మలప్రేమకూ – భక్తి శ్రద్ధలకూ – పూజ్యభావానికి, నిర్వచనం వుండేదిగాదు. వాటికి నేనేవిధంగానూ అర్హుణ్ణి కానేమో! నని తనలో తాను దిగులుపడుతూండేవాడు. దినచర్యల నిమిత్తం సావిత్రి తాల్చే రకరకాలైన రూపాల్ని చూస్తుంటే, రమణమూర్తికి హృదయం యెందుకో కలవరపర్చినట్లుండేది.

రమణమూర్తి తల్లి వుబ్బసపు రోగి. సావిత్రి ఆమెపట్ల చేసే సేవనుచూసి యెన్నో పర్యాయాలు తనలో తాను ఆశ్చర్యపడ్డాడు. ఒకరిచేత ఏ పనీ, ఏ మాటా చేయమని అనిపించుకోకుండా, అన్ని సదుపాయాలూ యింటిల్లిపాదికీ చేసేది. రమణమూర్తి తల్లి రోగానికి, తన చదువుకి, వుద్యోగ ప్రయత్నానికి, వుషారుగా తిరగడానికి చాలా డబ్బు అప్పుచేసి ఖర్చుపెట్టాడు. పెళ్ళయినా, సగానికి అప్పులింకా తీర్చకుండానే అట్టేపెట్టి వుంచాడు. ఒక ప్రక్కన తల్లి రోగం ఎక్కువవుతూ, ఖర్చు పెరుగుతోంది. మరోప్రక్క తాను వ్యథిత హృదయంతో అహర్నిశలూ సావిత్రిని తల్చుకుంటూ వుండాల్సొస్తోంది. రెండింటి మధ్యా రమణమూర్తి నలిగిపోసాగాడు. సావిత్రికిదేమీ తెలియదు. కాని, ఒక్క మాదు

రాత్రుల్ని మాత్రం ఆమె జీవితంలో మరువలేకుండా వుంది. సావిత్రితో తన పరిస్థితుల్ని గురించి ఎందుకు చెప్పటమూ? అని వూరుకొని, లోలోపలే కుమిలి కుమిలి దిగులుపడసాగాడు. తల్లి రోగానికీ – తన వ్యక్తిగతావసరాలకీ – యింట్లో తిండి ఖర్చుకీ – ఎడాపెడా అప్పుచేసి, యెట్టాగొట్టా బ్రతుకుని సాగిస్తూవున్న రమణమూర్తికి, సావిత్రి చేసే వుపచారాల్ని చూసి, గ్రహించేసరికి "సావిత్రికి నామీద యింత పూజ్యభావం వుందని" యింతవరకూ గట్టిగా అనుకోనేలేదు అని నివ్వెరపోయాడు – ఒకనాడు. అంతలోనే ఆత్మవంచన చేసుకొంటూ – "తన్ను నమ్ముకొని జీవిస్తున్న సావిత్రిని యింకా మోసం ముసుగులోనే వుంచుతున్నాను" అని ఆవేదన పడేవాడు. ఆ సమయంలో తాను కక్కుర్తిగా చేసిన పనికి క్షమాపణ చెప్పుకునేవాడు. తన తెలివితక్కువతనానికి నోటికొచ్చినట్లు తిట్టుకునేవాడు. పరిపరి విధాలుగా నిందించుకునేవాడు. ఎప్పటికైనా తన గుండెలోని రహస్యం బయటపడి తీరుతుందని, ఆనాటినుంచీ సావిత్రి తన్ను హేళనగా-చులకనగా – నీచంగా చూస్తుందని రమణమూర్తికి రూఢిగా తెలుసు. ఎలా చెప్పటానికీ వీలు చిక్కేదిగాదు – మొహం చెల్లేదిగాదు. మాటలు కుదిరేవిగావు. సావిత్రి మాత్రం గృహనిర్వాహణంలో ఎవరికీ, యే కష్టమూ రాకుండా ప్రవర్తించసాగింది. కాని, రమణమూర్తి మీద ఆనాడు – తొలిగా – తన తల్లిదండ్రులు నిర్మించిన ఆనందనిలయంలో – యే భావమైతే ఏర్పడిందో, అదే యింతవరకూ మరుపురాని మనోహరబాధగా వుంది. తల్చుకున్నపుడల్లా ఆనాటి తొలిదృశ్యం – మలిదృశ్యం – మూడవనాటి దృశ్యం లాస్యంచేస్తూ తన కళ్ళముందు కనిపిస్తూండేది.

ఆనాడు సావిత్రి భర్తని ఆఫీసుకి పంపిన పిమ్మట– అత్తగారికి సేవచేసి, పడుకునేటట్లు చేసిన తరువాత, తన శోభన దృశ్యాన్ని తల్చుకొంది తీయగా...

"ఆ ఆనందనిలయంలో ఒక మూలగా తాను నిల్చునివుంది. హృదయంలోవున్న తీయని కోరికలన్నీ రమణమూర్తి కోసం ఐక్యమై ఎదురుచూస్తూ వున్నవి. తనలో యింతమార్పు ఒక్కసారిగా కలిగినందుకు సిగ్గువేసింది. తను యీ సిగ్గుతో రమణమూర్తిని నిరుత్సాహపర్చటం భావ్యంగాదని అనుకొంది. ఆనందం పొందవలసిన సమయంలో అన్యాయంగా ప్రవర్తించటం తనపట్ల ఘోరపాపమని తల్చింది. అమ్మలక్కలు తన తల్లోపెట్టిన పూలు – పందిరి మంచం మీద పాలు త్రాగేముందు రమణమూర్తి పూసిన సెంటూ – మంచిగంధం పరిమళాన్ని వెదజల్లుతున్నాయి. టేబిల్ మీద అగరువత్తుల సౌగంధమాలికలు గది నాల్గు గోడల మధ్య గాలిలో వుంగరాలు – వుంగరాలుగా తిరిగి మత్తుకల్గిస్తున్నాయి. ఆ సమయంలో జీవితంపట్ల అంతవరకూ యేర్పడివున్న విముఖత్వం సుముఖత్వంగా మారింది. జీవిత పరమావధికమైన కోర్కెను అనుభవించటానికి అర్రులు సాచసాగింది. కౌతూహలం – ఆదుర్దా – ఆత్రుత – ఎక్కువైనాయి. యవ్వనం రమణమూర్తి మీదకి పడగవిప్పి బుసకొడుతోంది. రమణమూర్తి ఎందుకో దీనాతిదీనంగా మంచంమీదనుండి లేచి, కిటికీవద్దకు పోయి శూన్యప్రకృతిలోకి చూస్తూ నిలబడ్డాడు... 'సిగ్గుపడుతున్నాడేమో! ననుకొంది సావిత్రి. ఏం చేయాలో అర్థంకాలేదు. ధైర్యంచేసి తానే పల్కరిద్దామనుకొంది. వేరుగా భావించి విముఖత్వం ప్రదర్శిస్తాడేమో!' నని అంతలోనే అధైర్యపడింది. తనకు తానై ఎలాగో వెళ్ళి, లాలిస్తూ – మురిపెంగా ఒక చక్కెరకేళీ యిచ్చి, సరదాగా మాట్లాడేటట్లు చేద్దామనుకొంది. రమణమూర్తి ఆ సమయంలో స్తబ్దుగా వుండి యేదో దీర్ఘంగా ఆలోచించసాగాడు. రెండడుగులు ముందుకేసి రమణమూర్తి ముఖంవంక చూసింది. తన ప్రయత్నం ఫలించే సూచనలేవీ గోచరించలేదు. పైగా యెందుకో యేదో బాధపడుతూన్నట్టుగా వుంది. పరకాయించి పరిశీలనగా చూసింది. సగంరాత్రి దాటేవరకూ రమణమూర్తి హృదయంలో మథనపడే విషయం తెలియలేదు – తాను మాత్రం అలాగే నిల్చుని రమణమూర్తి కోసం ప్రతీక్షించసాగింది. వున్నట్టుండి అతను వెనక్కి తిరిగి, ఎండిపోతున్న పెదవుల్ని తడిచేసుకొంటూ – నిర్ణయించుకొన్న విషయాన్ని తెలియచేయడానికి, దగ్గరగా వచ్చాడు...ముఖంలోకి వింతగా చూసాడు... తనూ చూసింది మాదకత్వంతో. పల్కరింపు జరగలేదు – పన్నీరు చల్లలేదు...పరిమళం మాత్రం పరవశత్వాన్ని కల్గిస్తోంది. యిక తాను నిరీక్షించవలసిన అగత్యం లేదనుకొంది. రమణమూర్తి తన్ను దగ్గరగా తీసుకుందామనే వచ్చాడని భ్రమపడింది. శరీరం ఒక్కుమ్మడిగా పులకరించింది....రమణమూర్తి అంతవరకూ కూడా నోరు మెదల్పలేదు. 'చూపులతో సావిత్రిని కష్టపెట్టుంలేదు గదా!' – అని తనలో తాను అనుకొని చూస్తూవున్నాడు. ఎందుకో కంగారు - భయం అతణ్ణి వణికిస్తున్నాయి. గొంతుక పెగలటంలేదు. మనసులోని మాటను చెప్పలేక మథనపడసాగాడు.

(సశేషము)

# మతకర్తలు: తద్భక్తిభేదములు

శ్రీ వేదం వెంకట కృష్ణశర్మ

(డిశంబరు సంచిక తరువాయి)



నానకు డెబ్బదియేండ్లు జీవించెను. అతడనేక క్షేత్రములకు యాత్రలొనర్చెను. కురుక్షేత్రము, హరిద్వారము, బృందావనము, వారణాసి, ఆగ్రా, కాన్పూరు, అయోధ్య, ప్రయాగ, పాట్నా, రాజ్‌ఘుర్, గయా, పూరి- మున్నగు ప్రదేశములతఁడు సందర్శించెను. విశేషముగ అతఁడు తనకాలమును సంచారములందుఁ గడపెను. దూరప్రదేశములగు బంగాళము, దక్కను, సింహళము, బర్మా, సయాము, కాబూలు, ఖాందహార్ (గాంధారము), టర్కీ, మెక్కా, మెడినా- లకు వెడలెను. అటనట గొప్ప గొప్ప పండితులతోను, మహమ్మదీయ మతప్రచారకులతోను వాగ్వాదములు జరిపి, విజయము గాంచెను. తీర్థయాత్రాస్థలములగు, గయా, హరిద్వారము మొదలైన చోట్లలో దురాచారులగు పండాల దురాగతములు మాన్పెను. అతడు ప్రజలలోని అజ్ఞాన మేఘములను చెదరగొట్టెను. సంశయాంధకారమును బోగొట్టెను. మానవులు ధర్మమార్గమున చరింపవలెననియు, సోదరప్రేమ నలవఱచుకొనవలెననియు, ఆశ్రయించినవారియెడ ఆదరాభిమానములు చూపవలెననియు ప్రబోధించెను. అతని యుపదేశసారాంశములివి:- "భగవన్నామ జపమొనర్పుము; దేవునియెడ భక్తి నెరపుము; ఏకేశ్వరోపాసము కావింపుము; తోడి మానవుల సేవ చేయుము; పరమేశ్వరు డొకడే సర్వవ్యాపి, ఆయనను స్తోత్రము సల్పుము. ఆయనలో లీనమై ముక్తి సామ్రాజ్యము వడయుట కుద్యమింపుము."- అతడు ప్రజల మనస్సులలో ఒకవిధమగు మార్పు తేగలిగెను. వారు అతని నత్యంతము ప్రేమించిరి. నానకు వారిని ధర్మమార్గమున చరించుటకు భక్తికలిగియుండుటకును, హిందూమహమ్మదీయాది భేదములు పాటింపకుండుటకును ఉద్బోధించెను.

తరువాత గురునానకు ముల్తానుకు వెడలి అటనొక నదీతీరమున నిలిచెను. ముల్తానులో ఫకీరులు విశేషముగ నివసించుచుండిరి. అక్కడనే ప్రహ్లాదుడు జన్మించెనందురు. 'షామ్స్', 'తాబ్రీజ్', మాన్సూరులు కూడ అక్కడివారేనట! గురునానకు ఆ పురమునకు వచ్చెనని అక్కడి మహమదీయపీరులకుఁ దెలిసెను. వారతనికి అంచులవరకు నిండిన యొకగిన్నెతో పాలు పంపిరి. నానకు దానిలో కొన్ని చిటుకల చక్కెరవైచి, పైన తేలియాడునట్లొక పుష్పము నుంచి-మరల ఆ పాలగిన్నెను త్రిప్పిపంపెను. మర్దనుడు గురువుతో- 'స్వామీ, పాలవంటి పదార్థమును త్రిప్పిపంపరాదు. సంతసముతో తృప్తిగ త్రాగవలెను'- అనెను. అపుడు, నానకు 'మర్దనా, నీవెంత మతిమాలినవాడవు. ఆ తురకపీరులు పన్నిన కపటోపాయము నీవు గ్రహింపకుంటివి. వారా క్షీరమును నేనుపయోగించుకొనవలెనని పంపలేదు అట్లు వారొనర్చుటలో గల అంతరార్థ మెంతేని గలదు. అదేమనః- ఈ ముల్తాను పురమున నిప్పటికే యెందఱో పీరులు, ఫకీరులు ఈ గిన్నియలోని పాలవలె అంతటను నిండియున్నారు; కావున నింకేమతబోధకుని కిటఁ జోటులేదు". అని. నేనందులకు తగినట్లే నా యభిప్రాయమును సూచించితి చక్కెరవలె ఆ గుంపులో నేను గలసి పోవగలననియు, పైన తేలుచున్న పుష్పమువలె వారికన్న మిన్నగ ప్రకాశింపగలననియు తెలుపుటకు ఆ దుగ్ధమున జక్కెరవైచి పైన తేలియాడ ప్రసూనముంచితి'- అని వచించెను. తాము పంపిన పాలు తిరిగి ఆరీతి తమకడకు వచ్చుటను జూచి, ఆ పీరులు, ఫకీరులు ఆశ్చర్యచకితులై, నానకు కడకు వచ్చిరి. అప్పుడు నానకు భగవత్కీర్తనమును ఉత్కంఠతో గొంతెత్తి పాడగా, వారహంభావము త్యజించి, విధేయులై అతనితోఁ గలిసి దేవుని కీర్తించి నానకుతో "పూజ్యుడా! మేమమిత గర్వభూయిష్ఠులము. మీయెడ చాలనపచార మొనర్చితిమి. కరుణించి, మాకు ముక్తిమార్గముం జూపుము. ఆశీర్వదింపుము" అని వేడుకొనిరి. గురునానకును వారికాధ్యాత్మిక విషయములు ఉపదేశించి, భగవత్తత్త్వమును గూర్చి సావధానముగ వివరించి సంతృప్తిపఱచెను.

నానకు మక్కాకు యాత్ర వెడలినపుడు జరిగిన యొకముఖ్య విషయముం గూర్చి గమనింపదగియున్నది. అట నానకు మహమ్మదీయులు నమాజు

చేయు 'కాబా' వంక తన పాదములుంచుకొని నిద్రించుచుండెను. అదిచూచి, 'రుకానుద్దీన్' అను 'ఖాజీ' కోపించి, "ఓరీ, మతద్రోహీ! భగవద్ధ్యానస్థానము దిక్కునకు కాళ్లుచాచి పండుకొనునంతటి పొగరేమి?"– అని యతని కాలితో తన్నగా, నానకు తిన్నగా ఇట్లనెను:– "నేను చాల బడలియున్నాను. భగవంతుడు లేనిదిక్కునకు దయచేసి నాకాళ్లను త్రిప్పుము"– ఖాజీ రుఖానుద్దీను అట్లే క్రోధపరవశత్వముతో నాతని కాళ్ళను వేరొక తట్టునకు త్రిప్పెను. మసీదు సయితము ఆ తట్టునకే తిరిగెను. ఖాజీ విస్మయాక్రాంతచేతస్కుడై నిశ్చేష్టుడయ్యెను. ఇది గురునానకుయొక్క వైరాగ్యభావముతో గూడిన భక్తి అతని మనస్సున కెక్కునట్లొనర్చెను.

మరొకసారి, క్రీ.శ 1520 సం॥న గురునానకు వాయవ్యసరిహద్దు రాష్ట్రమునందలి 'అటోక్' మండలములోని 'హసన్ అబ్దల్' అను ప్రదేశమునకు వెడలియుండెను. అట నొకగుట్ట క్రిందిభాగమున గల రావిచెట్టునీడ నతడు కూర్చుండియుండెను. 'ఆ గుట్టపై వాలికాంధారి' అను సన్యాసి నివసించుచుండెను. అక్కడనే (ఆ పైభాగాననే) ఎల్లప్పుడు ప్రవహించు నీటియూటకాలువ యొకటి యుండెడిది. ఆ కాలువనుండి మర్దనుడు తనకును తన గురుపునకును నీరు తెచ్చెడివాడు. ఆ మహమ్మదీయసన్యాసి దానిం గని అసూయాగ్రస్తుడై మర్దనుని ఆ కాలువనుండి జలముం దీసికొనిపోరాదని ఆజ్ఞాపించెను. ఆ విషయమును మర్దనుడు గురునానకున కెరిగింపగా, అతడు: "మర్దనా! భయపడకుము, పరమేశ్వరుడు మనకు త్వరితముగనే నీటిని పంపగలడు"– అనెను. వెంటనే తిప్పమీది నీటియూటకాలువ పూర్తిగ ఎండిపోయి, గురునానకున్న క్రిందితట్టు సలసల నీటియూట ప్రవింపసాగెను. ఆ తురకసన్యాసి క్రోధోద్రిక్తుడై మండిపడి, నానకు కూర్చున్నచోటికి సరిగా నొకపెద్దబండరాతిని పైనుండి దొర్లించెను. దానిని నానకు తనచేతిని చాచి యడ్డగించెను. ఇప్పటికిని ఆ చేతిగుర్తొక బండరాతిపై ఆప్రదేశమున కనిపించుచున్నది.– అప్పుడా సన్యాసి గురునానకు కడకు వచ్చి సాగిలపడి మ్రొక్కి తన్ను క్షమింప వేడుకొనెను. చిరునగవుతో గురువతని లేవనెత్తి మన్నించెను. అచ్చట ప్రకృతము "పంజాసాహిబ్"– అను పవిత్రక్షేత్రము ప్రేక్షకులకు కనులవిందు సేయుచున్నది.

## గురునానకు ఉపదేశములు

భగవంతుని దివ్యనామము క్షణకాలమయిన మరచుటగాని, ఆయనను స్మరింపక ఒక్కనిశ్వాసమయిన జారవిడుచుటగాని అధర్మము. ఊపిరి పీల్చుకొనుటయు, వదలుటయు ఎవరు చెప్పి జరుగుచున్నది? ఒకడు ఈలోకమునకు వచ్చుటగాని, పోవుటగాని యెవరియాజ్ఞచే నడుచుచున్నది? ఉచ్ఛ్వాస నిశ్వాసముల పరిమితి ఎల్లరకొకటే. గురునానకు (నేను) లోపలి కూపిరి పోవునపుడును, బయటికి విడుచునపుడును భగవంతుని స్మరణము మానను. ప్రతిమానవునికి ఇది అందుబాటులో ఉండు మానసికవృత్తియే. కాన ఎల్లరు అవలంబించి అలవరచుకొనదగినది. దీనిచే మనము మనగమ్యము నందగలము. ముక్తి నొందగలము. ముముక్షువునకు జాతి కుల మత వర్ణాదిక భేదము లించుకయు లేవు. అన్నిమతముల సారాంశము సౌభ్రాతృత్వమును సత్యము ననియే తెలును. అదియే ప్రపంచమందలి మానవులనెల్ల నొకటిగచేయు ప్రేమపాశము. సోదరభావమేకోన్ముఖమయినపుడు గమ్యము నందించు తండ్రి భగవంతుడనుట నిస్సంశయము.

(సశేషము)

# మద్రాసులో కేసరివిద్యాలయ సంస్థాపకుని దినోత్సవం



కేసరీ విద్యా సంస్థ సంస్థాపకుడు స్వర్గీయ డా॥ కేసరి వర్ధంత్యుత్సవం త్యాగరాయనగర్ కేసరీ ఉన్నత పాఠశాల ఆవరణలో 11-2-61న జరిగింది.

బాలబాలికలతో, పురప్రముఖులతో కళకళలాడే ఈ సభకు మద్రాసు విద్యామంత్రి శ్రీ సి. సుబ్రమణ్యం అధ్యక్షత వహించవలసివుంది. కాని వారు అత్యవసర కార్యాలమీద, ఢిల్లీ వెళ్ళినందున ఈ క్రింది విధంగా సందేశం పంపారు.

"కేసరీ విద్యాసంస్థ స్థాపించిన పాఠశాలలు, ఆ సంస్థాపకుని అనంతదీక్షకు సంతతం జ్ఞాపక చిహ్నాలుగానిలుస్తాయి. తమ బిడ్డలకు మాతృభాషలో బోధనలేని రోజుల్లో తెలుగులో బోధన శాలలను నెలకొల్పి ఆదుకున్న ఆయన ఔదార్యాన్ని మద్రాసులోని ఆంధ్రులు నిరంతరం సంస్మరించుకుంటుంటారు."

కేసరీ విద్యాసంఘ అధ్యక్షులు డా॥ టి. యం. బి. నెడుంగాడీ స్వాగతపత్రం చదివారు.

కేసరీ విద్యాసంఘ కార్యదర్శి, దివాన్ బహద్దూర్, శ్రీ బండి శ్రీహరిరావునాయుడు విద్యాసంఘ నివేదికను చదివారు. కేసరిసంస్థ స్థాపించిన నాటినుండి నేటివరకు జరిగిన అభివృద్ధిని వివరిస్తూ శ్రీయుతులు గోగినేని వెంకటేశ్వరరావు, యార్లగడ్డ వెంకన్నచౌదరి, బి. నాగిరెడ్డి, డా. సి. రంగారావు, శ్రీమతి అంజలీదేవి, శ్రీ సి. యస్. ఆర్. ఆంజనేయులు, శ్రీమతి బి. నాగరత్నమ్మ, కుమారి శివభోగం మున్నగువారి సహాయ సంపత్తులవల్ల ఈ విద్యాసంఘ పాఠశాలలకు చాలా సౌకర్యాలు కలిగాయని, ఈ విద్యాలయాలకు "ఓపెన్ ఎయిర్ థియేటరు", మైలాపూరు హైస్కూలుకు రెండంతస్తులభవనం కావాలని వున్నాయని, ఇందుకుగాను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం రు 25 వేలు ఇచ్చారని, మద్రాసు ప్రభుత్వాన్నికూడా మొట్టమొదటిసారిగా రు 75 వేలు విరాళం కోరదలచామనీ, అలాగే తిరుపతి దేవస్థానాన్నికూడా రు 15,000/-కోరామని తెలిపారు.

మంత్రి శ్రీ పట్టాభిరామారావు తమ ప్రసంగంలో ఇలా అన్నారు. ఏరాష్ట్రానికి ఆ రాష్ట్రం తమ మాతృభాషలలో విద్య నేర్పించటం తేలికే. కాని ఆరాష్ట్రాల అల్పసంఖ్యాకవర్గాల విషయంలోనే కొద్దిగా ఇబ్బందులు కలుగుతుంటాయి. హైదరాబాదు, మద్రాసు, బొంబాయి, మొదలైన పెద్ద పెద్ద పట్నాలన్నీ ఈ సమస్యకే గురియౌతున్నాయి. ఐనా ప్రభుత్వాలు తాము చేయగలసహాయం చేస్తూనే వుంటాయి. ఐనా, ఇటువంటి సంస్థలు స్వయం కృషిలో అల్పసంఖ్యాకవర్గాల భాషను కాపాడడానికి ప్రయత్నిస్తుండటం ఎంతో గొప్పవిషయం.

కేసరిగారు చాల దూరదృష్టిగలవారు. అందుకే వారు ఉమ్మడి మద్రాసురాష్ట్రంలోనే సుమారు 2 లక్షల రూపాయలనిధిని ఏర్పాటుచేసి మద్రాసులోని ఆంధ్రుల సౌకర్యార్థం పాఠశాలలు నడపాలనే అభిప్రాయం వెలిబుచ్చారు, అన్నారు శ్రీ పట్టాభిరామారావు.

ఏసంస్థయినా బాగుపడాలంటే స్థాపకులకన్న దానిని నడిపేవారి చేతుల్లోనే వుంటుందని, కేసరీ విద్యాసంస్థలు ఇంతపటిష్టంగా వున్నాయంటే కేసరిగారితోటి సమానంగా స్వార్థరహితంగా, ధనం పోగుచేసి తెలుగు బిడ్డలకు విద్యాబుద్ధులకోసం ప్రయత్నించే శ్రీహరిరావు నాయుడే కారణమని, దివాన్ బహదూర్ శ్రీ శ్రీహరిరావునాయుడును ప్రశంసించారు, శ్రీ పట్టాభిరామారావు.

సాధారణంగా ధనం దుర్వినియోగం ఔతుందేమో అన్న భయంతో, సంస్థలకు ప్రజలు ధనసహాయం చేయటానికి సంకోచిస్తారు. కాని నిజాయితీ గల నిర్వాహకులున్నందువల్లనే కేసరి విద్యాసంస్థకు విరాళాలు బహుళంగా ఇస్తున్నారు, అని నిర్వాహకుల నిజాయతీని మంత్రి ప్రశంసించారు.

మంత్రి శ్రీ పట్టాభిరామారావు, ఒక రాష్ట్ర ప్రభుత్వం క్రిందవున్న సంస్థలకు ఇంకొక రాష్ట్ర ప్రభుత్వం సహాయం చేయటమనేది కష్టమైనపనని, ఈ రాష్ట్రంలో అధికార్లు కొంత బాధపడవచ్చునీ, ఐనా ఈ సంస్థవల్ల ప్రయోజనం కలుగుతుందిగనుక, తమ ధనం దుర్వినియోగం కాదనే నమ్మకముంది గనుక ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 25 వేల రూపాయలు ఇవ్వగలిగిందని, అలాగే తిరుపతి దేవస్థానంవారినికూడా ధనసహాయం చేయుమని సిఫార్సు చేశామని అన్నారు.

ఈ సందర్భంలో శ్రీ పట్టాభిరామారావు తిరుపతి దేవస్థానంచేస్తున్న అపారమైన సేవను ప్రస్తుతించారు. తిరుపతి దేవస్థానం ధనసహాయంవల్లనే

(కడపటి పేజి చూడుడు)

# విశాలాంధ్రలో విజయవంతముగా నడచుచున్నది





అన్నపూర్ణా వారి....

# వెలుగు నీడలు

నిర్మాత: D.మధుసూదనరావు. B.A.

దర్శకుడు: ఆదుర్తి సుబ్బారావు







నవయుగ రిలీజ్



# సంపాదకీయములు

## కుటుంబ నియంత్రణ విధానాలు

కుటుంబ నియంత్రణవలన జనాభా పెరుగుదల అరికట్టబడగలదనే ఉద్దేశాన్ని పెంపుచేయాలని విస్తృతంగా ధనం వెచ్చించ బడుతున్నది. కాని యీ కుటుంబనియంత్రణ విధానాలవలన జనాభా పెరుగుదల అరికట్టబడలేక పోవచ్చునని కేంద్ర రక్షణమంత్రి శ్రీ వి. కె. కృష్ణమీనన్ అన్నారు. అంటే కుటుంబ నియంత్రణావల్ల ఏర్పడేఫలితాలనుగురించి దేశంలో అన్నివర్గాలలోను సందేహాలు, సంకోచాలుంగలవనునది నిస్సంశయము. ఈ విధంగా ప్రభుత్వము నిర్వహిస్తున్న కొన్నిప్రణాళికల ఆదర్శలక్ష్యాల సిద్ధినిగురించి సందేహమున్నా గుడ్డెద్దు చేలోపడ్డట్టు నిర్వహింపబడుతూ అసంతృప్తికరమైన ఫలితాలు కలుగుతున్నవి.

ఈ నాడు ప్రచారంలోనున్న విధానాల ఫలితాలవివరాలు ఏలాంటివో తెలియకపోయినా జనాభా పెరుగుదలకు మాత్రం ప్రజలకు చేతినిండాపనిలేక పోవడం ఒక కారణమనవచ్చును. రెండవది కొందరిలో అలవడియున్న సోమరితనం, అన్యవ్యాపకాలు లేకపోవడం. ప్రజలకు పనిపాటులమీద యావ ఏర్పడి, కలిమిలేమిడులకు అతీతంగా ప్రతియొక్కడు విధిగా శక్తి సామర్థ్యాలు, యోగ్యతల ననుసరించి కృషిచేయవలసి ఏర్పడినచో సంతానం పెరుగుదల చాల తగ్గుతున్నది. బాలబాలికలలో బ్రహ్మచర్యం పరిమితవయసు వరకు క్రమబద్ధంగా నలవడి, యుక్తవయస్సువచ్చి కుటుంబ నిర్వహణకు ఆర్థికవసతుల్లాంటి యోగ్యతలు సమకూరినప్పుడే వివాహములు జరిగినచో జనాభా పరిమితంకాగలదు.

ప్రాపంచికచింతలకే అత్యధిక ప్రాధాన్యమివ్వక ఆధ్యాత్మిక పారమార్థికచింతలకు సయితము ప్రజల విద్యావిజ్ఞానములలో సముచితస్థానమమరిచినచో కుటుంబజీవితములోనే ఉపయుక్తమగు మార్పురాగలదు. ఇది సంతాన పరిమితికి తోడ్పడగలదు.

ఇదిలాగుండగా గర్భస్రావం కుటుంబనియంత్రణకు మార్గంగా కేంద్ర ఆరోగ్యమంత్రి ప్రోత్సహించినదానికి సమ్మతిచూపుట గమనించ తగినవిషయము. కృత్రిమపద్ధతులద్వారా గర్భస్రావము ఘోర అపచారమేకాక ఆరోగ్యక్షీణతకుకూడ దోహదము కాగలదు. కుటుంబనియంత్రణ మార్గాల నిర్దేశించే సందర్భమున భారతీయ సాంప్రదాయాలను, జాతీయవిశిష్టతను దృష్టిలోనుంచుకొని అనుభవజ్ఞులు మరింతగా పరిశీలనజరిపి నిర్ణయాలు చేయాలి!

---

(94 వ. పేజి తరువాయి)

వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, అనేక పాఠశాలలు నడుస్తున్నాయని, రాష్ట్రేతర ప్రదేశాల్లోకూడా దేవస్థానం కళాశాలలు నిర్వహిస్తున్నదని అన్నారు ఆంధ్రప్రదేశ్ విద్యామంత్రి.

ఏరాష్ట్రంలోనైనా అల్పసంఖ్యాక వర్గాలవారు తగినంతమంది వున్నప్పుడు వారి మాతృ భాషల్లో విద్యనేర్పే బాధ్యత ఆరాష్ట్ర ప్రభుత్వమే స్వీకరించాలి ఈ విషయంలో మద్రాసు, ఆంధ్ర, మైసూరులు ఒకసాధారణ ఒప్పందానికి వచ్చాయి (కామన్ అగ్రిమెంటు). మీరు ఏభాష మాట్లాడినా మద్రాసు పౌరులేగనుక అన్యరాష్ట్ర సహాయంకోసం ఎదురుచూచే బదులు మదరాసు ప్రభుత్వ సహాయంకోసం ఎదురుచూడటం, అడగటం శ్రేయోదాయకం, వాంఛనీయమన్న అభిప్రాయం శ్రీ పట్టాభిరామారావు వెలిబుచ్చుతూ మద్రాసు ఆంధ్రులకుసలహా యిచ్చారు.

మద్రాసువున్నంతకాలం, కేసరి పాఠశాలలు ప్రశంసనీయంగా, రాష్ట్రేతరాంధ్రుల అభివృద్ధికి చిహ్నంగా వుంటాయన్న అభిప్రాయం వెలిబుచ్చుతూ తమ ప్రసంగాన్ని ముగించారు, విద్యామంత్రి శ్రీ పట్టాభిరామారావు.

త్యాగరాయ నగరం కేసరీ హైస్కూలు ప్రధానోపాధ్యాయులు శ్రీ కె. తిరుమలాచారి వందన సమర్పణ చేశారు.

తరువాత శ్రీ పట్టాభిరామారావు: ఉన్నత శ్రేణి మార్కులు సంపాదించినందుకు కుమారి సి. విజయలక్ష్మి; నాగరత్నమ్మ సంగీత బహుమతి కుమారి సి. యస్. శ్రీదేవి, చిరంజీవులు: యం. బాబూరావు, పార్వతి, బ్రహ్మం, పి. ఆంజనేయులు, వి. సత్యసంపత్కుమారి, కె పద్మకుమారి కె. వసంత, కె. బి. రమణీకుమారి ప్రభృతి మైలాపూరు బాలలకు, తదితర త్యాగరాయనగర బాలలకు బహుమతులు పంచారు.

తరువాత నృత్యాలు, నాటికలు, నాటకాలు మొదలగువాటితో ఆనాటి కార్యక్రమం జయప్రదంగా ముగిసింది.

**Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor : C. C. Punniah.**
**Proprietors : Kesari Kuteeram (Private) Ltd.**

